(కొత్త మందుల తయారీ, 7 రోజుల మందు ఉచితం)

## తెల్లమచ్చలు



అత్యంత శీఘ్రంగా, ప్రభావశీలియైన మందుతో తెల్లమచ్చ రంగుమారి, నెమ్మదిగా శరీరం రంగులో మచ్చలేర్పడు కారణం దూరంచేస్తూ కల్సిపోవును. పరీక్షించుటకు 7 రోజుల మందు ఉచితంగా పంపుతాము. మిగిలిన వైద్యాలతో విసుగు, నిరాశ చెందితే మాకు రోగి వయస్సు మచ్చల వివరముతో వ్రాయండి.

## జుట్టు తెల్లబడుట, రాలుట



చిరుప్రాయంలో జుట్టు తెల్లబడుట, రాలుటకు విలువైన వనమూలికలతో తయారు చేయబడిన మందు కలదు. నల్లని ఒత్తైన జుట్టు, దట్టముగా పెరిగి, మెదడును చల్లపర్చును. రోగి వయస్సు, వివరాలతో తెల్పండి.

గమనిక: చికిత్సకు వివరములు, వయస్సుతో ఉత్తరములు పై అడ్రసుకు వ్రాయండి

## SHYAM AYURVED BHAVAN

**(SB-3) P.O. Katrisarai (Gaya) - 805 105 Ph. 06112-74311**

కోట్లకికోట్ల సంవత్సరాల పురాతన



FREE

Rasna®




SCARE
Game



# భయంకర మృగాలని బెదరగొట్టి తరిమెయ్యండి.



మీకు నచ్చే 11 రుచులుగల రస్నాతోబాటే మరింత ఉల్లాసాన్ని రేకెత్తించుకోండికనుంచీ. రస్నా సాఫ్ట్ డ్రింక్ కాన్‌సన్‌ట్రేట్ స్టాండర్డ్ ప్యాక్స్‌పైన ప్రచురింపబడిన 5 రస్నా డైనో స్కేర్ గేమ్ కూపన్లను సేకరించి, ఉత్సాహం రేకెత్తించే డైనో గేమ్‌ని ఉచితంగా పొందండి. దాంతో యిప్పుడిక ''ఐ లవ్ యూ రస్నా'' అని చకచకా సరదాగా అనడానికి మరిన్ని కారణాలు మీకోసం.

- ప్యాక్‌లు యీ ఆఫర్ లేకుండా కూడా దొరుకుతాయి.
- ఈ ఆఫర్ 31వ ఆగష్టు 1996 వరకూ అమలులో వుంటుంది.




Mudra:EAMR:9266 Tel.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## నిరుద్యోగ సమస్య!

మనదేశం స్వతంత్రం పొందిన తరవాత గత యాభైయేళ్ళలో విద్యారంగంలో ఎంతో ప్రగతిని సాధించింది. పాఠశాలలు, కళాశాలలు పెరిగాయి. నూతన విశ్వవిద్యాలయాలు వెలుస్తున్నాయి. మారుతూన్న కాలానికి అనుగుణంగా నూతన పాఠ్యాంశాలను ప్రవేశపెడుతున్నారు. విద్యాభ్యాసం పూర్తి కాగానే కొత్త కొత్త వృత్తులు చేపట్టడానికి అవకాశాలు పెరిగాయి. ఇది సంతోషించ తగిన పరిణామం!

అయితే, విద్యావకాశాలు పెరిగినంత విస్తృతంగా ఉద్యోగావకాశాలు పెరగడం లేదు. దాని ఫలితంగా విద్యావంతుల మధ్య నిరుద్యోగ సమస్య రోజు రోజుకూ పెరిగిపోతుంది. అయినా, నిరుద్యోగ సమస్య ఒక్క మన దేశానికి మాత్రమే పరిమితం కాదు. అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలలో కూడా ఈ సమస్య లేకపోలేదు!

ఉద్యోగం అనగానే కేవలం ప్రభుత్వ ఉద్యోగం కోసం కాచుక్కూర్చోవడంలో ప్రయోజనం లేదు. పైగా చదివిన చదువుకు తగిన ఉద్యోగమే కావాలనుకోకుండా, అవకాశం ఉన్న ఉద్యోగాలకు అనుగుణంగా మనల్ని మలుచుకోవడం ఎంతయినా అవసరం. ఎవరో మనకు ఉద్యోగాలు ఇవ్వాలను కోకుండా, మనకు మనమే వనరులు ఏర్పాటు చేసుకుని ఏదో ఒక వృత్తిని చేపట్టి స్వయంఉపాధి కల్పించుకోవడం అన్నిటికన్నా ఉత్తమం.

సంపుటి : 98 మే '96 సంచిక: 5

విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00

SANKAR

# JUST RELEASED

The first set of **Chandamama Books,** splendid in their content, illustrations, and production, is now ready.




Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

Discount for members of
**Chandamama Young Scholars Club.**



For details, write to :

**CHANDAMAMA BOOKS**
Chandamama Bldgs.
Vadapalani, Madras - 600 026.

వార్తలు - విశేషాలు:

# దక్షిణ కొరియాలో ఎన్నికలు

ఏప్రిల్ 11వ తేదీ దక్షిణకొరియా 15వ నేషనల్ అసెంబ్లీకి ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో ముగ్గురు కిమ్‌ల మధ్య పోటీ జరిగింది.299 స్థానాలు గల అసెంబ్లీలో పాలక పక్షమైన న్యూ కొరియా పార్టీకి 139 స్థానాలు లభించాయి. ప్రెసిడెంట్ కిమ్ యంగ్ శామ్ ఆ పార్టీ నాయకుడు. కిమ్ డే జంగ్ నాయకత్వంలోని ప్రధాన ప్రతిపక్షమైన నేషనల్ కాంగ్రెస్ ఫర్ న్యూ పాలిటిక్స్ పార్టీకి 79 స్థానాలు లభించాయి. కిమ్ జాంగ్ పిల్ నాయకత్వంలోని యునైటెడ్ లిబరల్ డెమొక్రట్స్ పార్టీకి 50 స్థానాలు మాత్రమే దక్కాయి.

299 స్థానాలలో 46 స్థానాలు ప్రపోర్షనల్ రెప్రజెంటేషన్ పద్ధతిలో నింపబడతాయి. 121 స్థానాలు గెలుచుకున్న పాలకపక్షానికి ప్రపోర్షనల్ రెప్రజెంటేషన్ ద్వారా 18 స్థానాలు పెరిగాయి. అంటే, అది మొత్తంమీద 139 స్థానాలు గెలుచుకున్నది. 1991లో జరిగిన ఎన్నికలలో దానికి 149 స్థానాలు లభించాయి. ఈ ఎన్నికలలో నేషనల్ కాంగ్రెస్ కనీసం 100 స్థానాలైనా లభిస్తాయని ఆశించింది. కాని ప్రపోర్షనల్ రెప్రజెంటేషన్ ద్వారా లభించిన 13 స్థానాలతో కలిపి 79 స్థానాలు మాత్రమే గెలుచుకోగలిగింది.

ప్రెసిడెంట్ కిమ్ యంగ్ శామ్‌కు 16 ఇండిపెండెంట్లలో కనీసం 11 మంది మద్దతయినా తప్పకుండా లభిస్తుంది. దాంతో ఆయన పూర్తి మెజారిటీ సాధించి, అధికారంలో కొనసాగగలడు. ఎన్నికలకు రెండు వారాలు ఉందనగా ఆయన విజయావకాశాలు కోల్పోగలడని భావించారు. ఉత్తరకొరియా సైనిక దాడి జరిపింది. ఆ చర్యను ప్రపంచదేశాలు ఖండించాయి. ఇది పాలకపక్షానికి కొంత అనుకూలంగా పనిచేసింది. నేషనల్ కాంగ్రెస్‌కు అనుకున్న 100 స్థానాలు లభించి ఉన్నట్టయితే, అది పాలకపక్షం తీసుకురావాలనుకుంటూన్న రాజ్యాంగ పరమైన మార్పులకు ప్రతిబంధకమై రాజ్యాంగ సంక్షోభానికి దారితీసి ఉండేది.

ఈ ఎన్నికలను గురించి రాజకీయ పండితులు - ప్రెసిడెంట్ కిమ్ ఆశించిన విజయం అందుకోలేదు; కిమ్ డే జంగ్ పరిస్థితి మరీ బలహీనమైపోయింది అని అభిప్రాయపడ్డారు. ఒకే వ్యక్తి రెండవసారి ప్రెసిడెంట్ కావడానికి కొరియా రాజ్యాంగం అనుమతించదు. కాబట్టి కిమ్‌యంగ్ శామ్ 1997 ప్రెసిడెంట్ ఎన్నికలలో పాలకపక్షం తరపున వేరొక అభ్యర్థిని నిలబెట్టడానికి పార్టీని బలపరచుకోవాలి. అయినా, 1998 వరకు కిమ్ యంగ్ శామ్ ప్రెసిడెంట్‌గా కొనసాగుతాడు.

నేషనల్ అసెంబ్లీ ఎన్నికలు ముగిసిన ఒక వారం లోగా అంటే, ఏప్రిల్ 16వ తేదీ అమెరికా ప్రెసిడెంట్ బిల్‌క్లింటన్ దక్షిణకొరియాకు వచ్చి, కిమ్‌యంగ్‌శామ్‌తో చెజూ దీవి గురించి చర్చలు జరిపాడు. కొరియా ద్వీపకల్పంలో సుస్థిరమైన శాంతి ఏర్పడడానికి నాలుగు పక్షాలూ అంటే - దక్షిణకొరియా, ఉత్తరకొరియా, చైనా, అమెరికా చర్చలు జరపాలని ఉభయులు పిలుపునిచ్చారు. సుస్థిరమైన, శాశ్వతమైన శాంతి, కొరియా ప్రజల ఆశయం. దానిని సాధించడానికి ఉభయ కొరియా దేశాలూ పాటుపడాలి అని ప్రకటించారు.

చాలాకాలం క్రిందట ఒకే ఒక కొరియా ఉండేది. మళ్ళీ సమైక్య కొరియా కోసం ప్రపంచం ఎదురుచూస్తున్నది.



# ప్రహ్లాదుడి పొగడ్తలు

వరదయ్య అనేవాడు బొత్తిగా ఏ పనీ చేయడు. తల్లిదండ్రులూ, అన్నలూ, వదినెలూ మాత్రమే కాక, ఎరిగున్న వాళ్ళందరూ వాడిని ఎందుకూ పనికిరానివాడుగా జమకట్టారు. ఆమాట ముఖంమీదే అన్నాసరే వాడు పట్టించుకునేవాడు కాదు.

ఒకసారి వరదయ్య మేనమామ సుకీర్తి వాడింటికి వచ్చాడు. ఇంట్లో అందరూ వరదయ్య గురించి బాధపడటం విని, ఆయన మేనల్లుణ్ణి మందలించాడు.

"నేనేం తప్పు చేశాను?" అన్నాడు వరదయ్య బాధగా.

"మనిషిపుట్టుక పుట్టేక, ఎంతో కొంత సంపాదించడానికి ఏదో ఒక పని చేయాలి. ఈ మాత్రం నీకు తెలియదా?" అన్నాడు సుకీర్తి.

"సంపాదనఎందుకు? కూడు,గుడ్డ,తల మీద ఇంత నీడ కోసమే కదా? ఈ మూడూ నాకు పనిచేయకుండానే దొరుకుతున్నవి కదా!" అన్నాడు వరదయ్య.

ఈ జవాబుకు సుకీర్తి విసుక్కుంటూ, "అమ్మా, నాన్నా ఎల్లకాలముండరు. అన్నలూ, వదినలూ ఎల్లకాలం చూడరు. అప్పుడేం చేస్తావు?" అని ప్రశ్నించాడు.

"నేనే కష్టపడిబోలెడు సంపాదించి దాచుకుంటే, అదంతా దొంగలెత్తుకు పోరని నమ్మక మేమిటి? అందుకే జ్ఞాని రేపటి గురించిఆలోచించడు.నేను జ్ఞానిని," అన్నాడు వరదయ్య.

దీనికి సుకీర్తి ఆశ్చర్యపోతూ, "మనిషి పుట్టుక పుట్టేక ఏదో ఒకటి సాధించాలి. లేకపోతే నీ పుట్టుకకు సార్థకత లభించదు," అన్నాడు.

"సార్థకత అంటే ఏమిటి మామయ్యా?" అని అడిగాడు వరదయ్య. "నీ పేరు కలకాలం అందరికీ గుర్తుండి పోవాలి. అదీ

జొన్నలగడ్డ రామలక్ష్మి

సార్థకత అంటే! తెలిసిందా?" అన్నాడు సుకీర్తి.

"అలాగా, మా తాతగారు పోయి పదేళ్ళ యింది. ఇప్పుడూళ్ళో అందరూ ఆయన్ని మరిచిపోయారు. మా ముత్తాతగారిదైతే పేరు కూడా ఎవరికీ, ఆఖరుకు ఇంట్లోవాళ్ళకు కూడా సరిగ్గా గుర్తులేదు. ముత్తాతకు ముందు వాళ్ళెవరో ఎవరికీ తెలియదు. ఈ ప్రపంచంలో శరీరానికిలాగే పేరు కూడా శాశ్వతం కాదు. అశాశ్వతమైన వాటికోసం శ్రమించడం వృధా కదూ?"అన్నాడువరదయ్య తడుముకోకుండా.

మేనల్లుడి మాటలకు సుకీర్తి నిట్టూర్చి,"ఒరే, నీకు మాట్లాడటంలో చాలా తెలివి ఉంది. కానీ, ఏం లాభం? బ్రతికుండగా ఒక్కసారైనా, కనీసం ఒక్కరిచేతనైనా మెప్పు పొందనిదే జీవితానికి సార్థకత లేదు," అన్నాడు.

"సార్థకత అన్న పదాన్ని చక్కగా ఉపయోగిస్తున్నావు, మామయ్యా! నువ్వనే ఆ సార్థకత నా జీవితానికి లభించినట్లే! ఈ ఊళ్ళో ప్రహ్లాదుడనే గొప్పాయన ఉన్నాడు. ఆయన నన్ను కనిపించినప్పుడల్లా పొగుడుతూంటాడు. తెలుసా?" అన్నాడు వరదయ్య గొప్పగా.

"ఏమో? నేను నమ్మను!" అన్నాడు సుకీర్తి.

"అయితే సాయంత్రం కాలవగట్టుకురా. నీ కళ్ళారా చూసి చెవులారా విందువుగాని!" అన్నాడు వరదయ్య.

ఆ సాయంత్రం సుకీర్తి కాలవగట్టుకు వెళ్ళాడు. ఆ సమయంలో వరదయ్య ఒక



చెట్టుకింద చతికిలబడి కూర్చుని తనలో తాను పాట పాడుకుంటున్నాడు. అంతలో ప్రహ్లాదుడలా వచ్చాడు.

వరదయ్య చటుక్కున లేచి నిలబడి ఆయనకు దణ్ణం పెట్టాడు.

"కూర్చోరా!" అన్నాడు ప్రహ్లాదుడు.

"తమబోటి గొప్పవారు నిలబడిఉండగా నేనెలా కూర్చునేది బాబూ!" అన్నాడు వరదయ్య వినయంగా.

ప్రహ్లాదుడు గొంతు సవరించుకుని, "గొప్పతనంలో ఎవరైనా నీ తర్వాతే రా! నీవు మహాజ్ఞానివి. మహాయోగులకు కూడా నీ దశకు చేరుకోవాలంటే వందేళ్ళు పడుతుంది. మా మధ్య ఉండిపోయి నీకు విలువ

లేకుండా ఉందికానీ, జ్ఞానుల మధ్య ఉంటే వాళ్ళందరూ నిన్ను ఆరాధించి ఉండేవాళ్ళు. వేదాంతాన్ని చదవడం వేరు అర్థం చేసుకోవడం వేరు, వంటబట్టించుకోవడం వేరు. నువ్వు వేదాంతాన్ని వంటబట్టించుకున్నావు కదరా!" అన్నాడు.

"అంతా మీ అభిమానం, నా గొప్పతనమేం లేదు," అన్నాడు వరదయ్య ఏమాత్రంపొంగిపోకుండా.

"నాకు సమయం చిక్కడం లేదుగానీ, నీతోపాటు కొంతసేపు వేదాంతచర్చ చేయాలని ఉందిరా! ఎప్పుడో ఆ భగవంతుడు అనుగ్రహించకపోడులే!" అనేసి ప్రహ్లాదుడు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అంతవరకూ కాలవగట్టు చెట్లచాటున ఉండి, ఈ సంభాషణ వింటున్న సుకీర్తి బయటకు వచ్చి, "ఘటికుడివే! బాగా పొగిడించుకున్నావు. ఏం మంత్రం వేశా వేమిటి?" అన్నాడు కుతూహలంగా.

"అంతా ఇచ్చిపుచ్చుకోవడం, అంతే! నేనాయనను పొగుడుతాను. ఆయన నన్ను పొగుడుతాడు," అన్నాడు వరదయ్య.

సుకీర్తి అయిష్టంగా తలాడించి, "అలాంటి పొగడ్తలకు విలువలేదు. అందరిచేతా గొప్పవాడుగా గుర్తించబడిన వాడిచేత పొగడ్తలందుకోవాలి. అప్పుడే జీవితానికి సార్థకత!" అన్నాడు.

"ప్రహ్లాదుణ్ణి గురించి నీకు తెలియదు, మామయ్యా! ఆయన చాలా గొప్పవాడు," అన్నాడు వరదయ్య ఉక్రోషంగా.



"ఏంగొప్పో- నిన్ను పొగడగానే తెలిసి పోయింది," అన్నాడు సుకీర్తి హేళనగా.

దీనికి వరదయ్య కోపం తెచ్చుకుని, "నన్నయితే ప్రహ్లాదుడొక్కడే పొగుడుతాడేమో కానీ, ఆయనను ఈ ఊళ్ళో పొగడనివాడంటూ లేడు. కావాలంటే, నలుగుర్ని అడిగిచూడు," అంటూ మేనమామను సవాలు చేశాడు.

మేనల్లుడి మాటలపై నమ్మకం కుదరక సుకీర్తి, ఊళ్ళో ఒక్కొక్కరినీ అడిగి చూశాడు. ఒక వ్యాపారి ప్రహ్లాదుడి అర్థశాస్త్రజ్ఞానాన్ని మెచ్చుకున్నాడు. ఒక పండితుడాయన పాండిత్యాన్ని మెచ్చుకున్నాడు. ఒక చిత్రకారు డాయన వేసే బొమ్మల్ని మెచ్చుకుంటే, ఒక సంగీత విద్వాంసుడాయనకంఠస్వరాన్ని మెచ్చు కున్నాడు. ప్రహ్లాదుడు సకలశాస్త్ర పారం గతుడనీ, సకల కళాకోవిదుడనీ సుకీర్తికి అర్థమయింది. ఆయన సామాన్యుడు కానప్పుడు, మేనల్లుడిలో ఏం గొప్పతనంచూసి అంతగా పొగిడాడో అర్థం కాక సుకీర్తి తబ్బి బ్బులయ్యాడు.

ఆయన ఈ సంగతి ఇంట్లో చెబితే వరదయ్య తండ్రి నవ్వి, "ఎదుటివాళ్ళు ఎలాంటి వాళ్ళయినా పొగడడం గొప్పవాళ్ళ లక్షణం. మనవాణ్ణి పొగడ్డంవల్ల ఆయనగొప్ప తనం పెరిగింది తప్ప- వాడికేం గొప్ప తనం అంటలేదు," అన్నాడు.

వరదయ్య తల్లి మాత్రం సుకీర్తితో, "తమ్ముడూ! మనవాడిలో ఆయన ఏదో గొప్పతనం చూసే ఉంటాడు. అదేమిటో తెలుసుకోమంటే ఒక్కరూ నా మాట పట్టిం





"పొగడ్డం అలవాటా! అందరినీ విచక్షణ లేకుండా పొగడ్డం తప్పు కాదా? తమవంటి గొప్పవారికిది తగునా?" అన్నాడు సుకీర్తి.

ప్రహ్లాదుడు చిన్నగా నవ్వి, "పొగడ్డంలో తప్పేముంది. అందువల్ల ఎదుటి మనిషికి ఉపకారమే తప్ప, అపకారం అన్నది లేదే!" అన్నాడు.

"ఎందుకూ పనికిరాని వాడిని జ్ఞానిఅనడం వల్ల, వాడు మరింత పాడయ్యే అవకాశం లేదా?" అని అడిగాడు సుకీర్తి.

"లేదు! ఎలాంటివాడికైనా ఎంతోకొంత సిగ్గు ఉంటుంది. నేను పొగిడినవాడు జ్ఞాని అయితే, పొగడ్తకు వినయంతో సిగ్గుపడతాడు. జ్ఞాని కాకుంటే నా పొగడ్తను నిజం చేయడానికి కృషి చేస్తాడు," అన్నాడు ప్రహ్లాదుడు.

"మీరు పొగిడినవాడు సిగ్గులేనివాడైతే?" అని ప్రశ్నించాడు సుకీర్తి.

"సిగ్గులేనివాడైతే, నాకు ప్రమాదం తప్పుతుంది," అన్నాడు ప్రహ్లాదుడు తడుముకోకుండా.

"మీకు ప్రమాదమా, అదేమిటి?" అన్నాడు సుకీర్తి ఆశ్చర్యంగా.

"ఏ పనీ చేయనివాళ్ళు సిగ్గులేనివాళ్ళయితే– వాళ్ళు గొప్పవాళ్ళను హేళన చేయడమే పనిగా పెట్టుకుంటారు. నేను ఎక్కడికి వెళ్ళినా అందరి నోటా పొగడ్తలే వింటాను. ఎవరి నోటా హేళనను వినడం నాకిష్టం ఉండదు. అందుకే అందరినీ పొగుడు

చుకోరు. ఒకసారి నువ్వయినా ఆయన్నడిగి తెలుసుకో," అన్నది.

సుకీర్తికి ఈ విషయమై కుతూహలంగానే ఉన్నది. అందువల్ల ఆయన మర్నాడే వెళ్ళి, ప్రహ్లాదుణ్ణి కలుసుకుని తన గురించి చెప్పుకుని, ఆయనను పొగిడాడు.

ప్రహ్లాదుడు చాలా సంతోషించి, "మీకు నావల్ల ఏమైనా ప్రయోజనముంటే చెప్పండి. తప్పక సాయపడతాను," అన్నాడు.

సుకీర్తి వెంటనే వరదయ్యను గురించి చెప్పి,"వాడిలో మీరుచూసిన గొప్పతనమేమిటో చెప్పండి," అని అడిగాడు. ప్రహ్లాదుడాశ్చర్యపడి,"వరదయ్యను గురించినాకేమీతెలియదు. పొగడ్డం నా అలవాటు. అంతే!" అన్నాడు.

తుంటాను. అందువల్ల అన్నివిధాలా వాళ్ళకూ, నాకూ ప్రయోజనం," అన్నాడు ప్రహ్లాదుడు నవ్వుతూ.

సుకీర్తి ఆయన పద్ధతికి ఆశ్చర్యపడుతూ, "అయ్యా! అంతా బాగానే ఉందికానీ, తమరు పొగడ్తల విషయంలో కొంత విచక్షణ పాటించాలి. లేకుంటే నా మేనల్లుడివంటి వారు, తాము మహాజ్ఞానుల మకునే ప్రమాదముంది," అన్నాడు.

ప్రహ్లాదుడు నవ్వి, "తనకు తానుగా తన గురించి తెలుసుకున్నవాడే జ్ఞాని. ఇతరుల ద్వారా తను జ్ఞానినని తెలుసుకునేవాడు మూర్ఖుడు. నా మాటలతో ఒకరి జ్ఞానం పెంచలేను. ఒకరి మూర్ఖత్వాన్ని తగ్గించలేను," అన్నాడు.

"అయినప్పటికీ, పొగిడేముందు ఇతరుల గురించి తెలుసుకోవడం అవసరం కదా!" అన్నాడు సుకీర్తి తన పట్టువిడవకుండా.

ప్రహ్లాదుడు కాదన్నట్లు తల ఊపి, "ఇతరుల గురించి తెలుసుకునేందుకు వినియోగించవలసిన సమయాన్ని నేను కొత్త విషయాలు తెలుసుకునేందుకు ఉపయోగించుకుంటాను. పనికిరానివాళ్ళ గురించి నా కాలాన్ని వృథా చేయలేను. ఏదో ఒకటి నేర్చు కోవాలనుకునే నేను, ఎవరితో అయితే కాలక్షేపం చేయనో వాళ్ళు పనికిరానివాళ్ళని లెక్క. అలాంటివాళ్ళను నేను నాలుగు పొగడ్తలతో త్వరగా వదుల్చుకుంటాను," అన్నాడు.

సుకీర్తికి తన అనుమానాలన్నీ తీరిపోయాయి.

ఆయన ఇంటికి తిరిగివచ్చి, మేనల్లుడికి జరిగినదంతా చెప్పి, "ఒరేయ్, ప్రహ్లాదుడి నుంచి నేను చాలా నేర్చుకున్నాను. ఇక మీదట నేను నీతో నాలుగు పొగడ్తలు తప్ప ఇంకేమీ మాట్లాడను. నిజానికి నీ అంతటి మహాజ్ఞాని ఈ భూప్రపంచంలో ఉండడనుకో!" అని తన ఊరు వెళ్ళి పోయాడు.

అప్పటికి వరదయ్యకు తన గురించి బాగా అర్థమై సిగ్గుపడ్డాడు. క్రమంగా వాడిలో మార్పు వచ్చింది. ఆ తర్వాత మళ్ళీ పొగడ్తల కోసం ప్రహ్లాదుడి ఎదుటపడే ప్రయత్నం మాత్రం చెయ్యలేదు.



# అబద్ధం

చిన్నాపురం అనే గ్రామంలో శంకరలింగం అనే యువకుడుండేవాడు. వాడికి అబద్ధాలు చెప్పి జనాన్ని నమ్మించి, ఆనందించడం సరదా. వాణ్ణి అందరూ అబద్ధాలమారివెధవ అని పైకి ఈసడించినా, మహాతెలివిగలవాడని కూడా అనుకుంటూండేవారు.

ఒకసారి శంకరలింగం వీధిన పోతూండగా, పెద్దాపురం గ్రామంవాడైన ఈశ్వరయ్య వాణ్ణి పలకరించి, "నేను పొరుగుగ్రామం వాడినైనా, నిన్ను గురించి బాగా తెలుసు. నువ్వు అబద్ధాలు చెప్పి అందర్నీ నమ్మిస్తూంటావట. ఏదీ ఒక్క అబద్ధం చెప్పి నన్ను నమ్మించు, చూద్దాం!" అన్నాడు.

శంకరలింగం ఈశ్వరయ్యను ఎగాదిగా చూసి, "అబద్ధం చెప్పి నిన్ను నమ్మించడం అలా ఉంచి, నీతో ఒక్కమాట పలికేందుక్కూడా నాకు తీరిక లేదు. ఊరి చెరువుకు గండిపడి నీరంతా పక్కనున్న పొలాల్లోకి ప్రవహిస్తున్నది. ఎన్ని చేపలనైనా అలా చేత్తో పట్టుకుని ఇంటికి తీసుకుపోవచ్చు!" అంటూ చెరువుకేసి పరుగు ప్రారంభించాడు.

అంత తేలికగా చేపలు దొరుకుతున్నవని వినగానే ఈశ్వరయ్యకు ఆశపుట్టి చెరువుకేసి పరిగెత్తాడు. చెరువులో నీళ్ళు నిండుగా ఉన్నవి. దానితో అతడికి శంకరలింగం, తనకుఅబద్ధం చెప్పి నమ్మించాడని అర్థమైంది.

– డి. శంభుదాసు






## 11

[ట్రోయ్‌యుద్ధం ముగిసినాక తన స్వదేశమైన ఇథకాను చేరుకోవటానికి బయలుదేరిన రూపధరుడు అనేక ఏళ్లపాటు చెప్పరాని కష్టాలు పడి, అపాయాలను ఎదుర్కొని, తన అనుచరులనందరనూ కోల్పోయి, ఒంటరిగా స్వదేశానికి చేరాడు. కాని ఇంకా అతని కష్టాలు తీరలేదు. అతని ఇష్టదేవత అయిన బుద్ధిమతీదేవి అతని క్షేమం కోరి రూపధరుడి రూపాన్ని పూర్తిగా మార్చి వృద్ధుడిలాగా కనపడేటట్టు చేసింది. ఈలోపుగా ఇథకాలో...... ]

ట్రోయ్‌యుద్ధంనుంచి గ్రీకులు తిరిగివచ్చినాక రూపధరుడు దారిలో మరణించాడని వదంతి పుట్టింది. ఇథకాలోనూ, దాని పరిసరాలలో ఉన్న దీవులలోనూ గల రాజకుమారులు నూటపన్నెండుమంది రూపధరుడి ఇంటిపై వచ్చిపడ్డారు. ఎలాగయినా రూపధరుడి భార్య అయిన పద్మముఖిని పెళ్లాడి ఇథకాకు రాజు కావటమే వారిలో ప్రతిఒక్క రాజ కుమారుడి ఆశయమూనూ.

ధీరమతి అప్పుడే యౌవనం పొడచూపు తున్న కుర్రవాడు. అతను పసివాడుగా ఉండ గానే రూపధరుడు యుద్ధానికి బయలుదేరి వెళ్ళాడు. అందుచేత ధీరమతి తన తండ్రిని బొత్తిగా ఎరగడు. అయితే అతను తనతండ్రి రాకకోసం ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తు న్నాడు. ఆయనను గురించి ఏ వార్తా లేక పోవటం అతనిని చాలా బాధించింది. “ఆయన పోయినట్టు నమ్మకంగా తెలిసినా

బాగుండును. మా అమ్మ ఎవరినో ఒకరిని పెళ్లాడేస్తుంది," అనుకున్నాడతను.

ప్రస్తుతం ఈ రాజకుమారులందరూ ధీరమతిని అసహాయుడికింద కట్టేసి, అతని ఇంట తిష్ఠవేసి, రూపధరుడి పశుగణాలను కోసుకు తిని విందులు ఆరగిస్తూ, తాగి తందనాలు వేస్తూ, పద్మముఖి నా భార్య అంటే నా భార్య అని ప్రగల్భాలు పలుకుతున్నారు. వారిని ఎలా వదిలించుకోవాలో ధీరమతికి తెలియలేదు.

ఇక, పద్మముఖికి తన భర్త తిరిగి వస్తాడని గట్టి నమ్మకం. రూపధరుడు చచ్చిపోలేదనీ, అతను తిరిగి వస్తాడనీ జోస్యం ద్వారా ఆమె తెలుసుకుని ఉన్నది. అందుచేత ఆమె తిరిగి పెళ్లాడ నిరాకరించింది. కాని ఆమెను కోరివచ్చిన రాజకుమారులు రూపధరుడు చనిపోయాడని చెప్పి ఆమెను పెళ్లికి తొందర చేయసాగారు. వారిని తప్పించుకొనటానికి ఆమె ఒకయుక్తి పన్నింది: "నేను మా మామగారి శవంపై కప్పటానికి ఒక బట్ట నేస్తున్నాను. అది పూర్తి కాగానే స్వయంవరం చేసుకుంటాను," అన్నది. రాజకుమారులు సరేనన్నారు.

అది మొదలు పద్మముఖి రోజూ పగలల్లా బట్ట నేయటమూ, రాత్రివేళ నేసినదంతా విప్పదీయటమూ చేస్తూ రాసాగింది. ఇలా మూడేళ్లు సాగాక రాజకుమారులు ఆమె చేసిన మోసం ఒకనాడు పట్టేశారు. దాంతో వారి దౌర్జన్యం మితిమీరసాగింది. ఇది చూసి ధీరమతి బాగా ఆలోచించి ఒక



నిర్ణయానికి వచ్చాడు. అతను పైలాస్‌కు వెళ్ళి నవద్యోతుణ్ణీ, స్పార్టాలో ప్రతాపుణ్ణీ కలుసుకుని తన తండ్రి వార్తలు తెలుసుకుందామనుకున్నాడు. అందరికన్న ఆఖరుకు ఇల్లు చేరినవాడు ప్రతాపుడు; అందుచేత ఆయనకు తన తండ్రి వృత్తాంతం కొంత అయినా తప్పక తెలిసి ఉండవచ్చు.

"మా తండ్రి పోయినట్టు తెలిస్తే ఆయనకు ఉత్తరక్రియలు చేసి మా అమ్మకు స్వయంవరం జరిపిస్తాను. అంతేగాని ఈ దుర్మార్గులను ఇక ఎంత మాత్రమూ సహించను. నా ఈడు యువకులు ఎంతో శౌర్య పరాక్రమాలు చూపిస్తున్నారు. మా తండ్రి బతికే ఉన్న పక్షంలో, ఇంటచేరి మా తల్లిని వేధిస్తూన్న ఈ దుర్మార్గుల నందరినీ ఏదోవిధంగా తప్పకుండా కడతేర్చుతాను!" అనుకున్నాడు ధీరమతి. ఈ విధంగా నిర్ణయించుకున్నవాడై ధీరమతి ఆ రోజు రాజకుమారులతో, "అయ్యలారా, మీరంతా మా అమ్మను పెళ్లాడ గోరుతున్నామంటున్నారు. బాగానే ఉంది గాని, మీ ప్రవర్తన నా కెంతమాత్రమూ నచ్చలేదు. రేపు రచ్చబండలో సమావేశం జరిపి, మీరంతా నా ఇంట్లో నుంచి వెళ్లిపోవాలని బహిరంగంగా మిమ్మల్ని కోరబోతున్నాను. మీ ఇళ్లలో తినండి తాగండి. ఇక్కడే మీ ఆగడాలు సాగించదలచిన పక్షాన మీరు నిర్మూలమైపోగలరు!" అని హెచ్చరించాడు.

అకస్మాత్తుగా ఆ కుర్రవాడు ప్రదర్శించిన సాహసం చూసి వారందరూ ఆశ్చర్య పడ్డారు.





పద్మముఖిని పెళ్లాడగోరే రాజ కుమారులలో ఉన్నాడు. ఈ వృద్ధుడు లేచి నిలబడి, "నాయనలారా, ఈ సమావేశం ఏర్పాటు చేసినవారెవరోగాని, చాలా మంచిపని చేశారు. ఎందుకంటే రూపధరుడు యుద్ధానికి వెళ్లాక ఇథకాలో ప్రజలు సమావేశం కానేలేదు. ఇవాళ మనం ఎందుకు సమావేశమయ్యామో నాకు కూడా తెలుసుకోవాలని ఆత్రంగా ఉంది!" అన్నాడు.

వృద్ధుడి మాటలు ధీరమతిని ఉత్సాహపరిచాయి. అతను లేచి నిలబడి, "అయ్యా, ఈ సమావేశాన్ని ఏర్పరచినది నేనే. కేవలం నా సొంత కష్టాలు చెప్పుకొనటానికే మిమ్మల్ని ఆహ్వానించాను. నా ఇంటికి రెండు కష్టాలు దాపరించాయి. నేను ప్రసిద్ధుడైన నా తండ్రిని పోగొట్టుకున్నాను; ఆయన ఒకప్పుడు మీ అందరికీ రాజు. అంతకంటె కూడా పెద్ద ఉపద్రవం మరొకటి వచ్చిపడింది; మా అమ్మను పెళ్లాడే ఉద్దేశంతో అనేకమంది వచ్చి మా ఇంటిపై బడి మా ఇల్లు గుల్ల చేస్తున్నారు. త్వరలోనే నేను సర్వ నాశనమై పోతానని భయంగా ఉన్నది. ఈ పని చేస్తున్నవారిలో ఇక్కడ చేరినవారి కుమారులు కొందరున్నారు. మా తాతగారి వద్దకు వెళ్లి మా అమ్మనిచ్చి వివాహం చెయ్యమని అడగటానికి వారికి ధైర్యం చాలదు. అందుచేత మా ఇంట చేరి మా పశువులను చంపి తింటూ, మా సారా తాగుతూ, యథేచ్ఛగా

మర్నాడు తెల్లవారగానే ధీరమతి చాటింపు వేసేవారిని పిలిచి, రచ్చబండలో పౌరులందరూ సమావేశం కావలిసిందిగా చాటించి రమ్మని ఉత్తరువిచ్చాడు. అతను రచ్చబండవద్దకు ఒక బల్లెం చేత బట్టి, రెండు కుక్కలను వెంటబెట్టుకుని, దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వెళ్లాడు. అక్కడ చేరిన పెద్దలు ధీరమతిని అతని తండ్రి కూర్చుంటూ ఉండిన అగ్ర స్థానంలో కూచోనిచ్చారు. అందరూ ఎవరి స్థానాలలో వారు కూచోగానే చాలా వృద్ధుడైన ఐగుప్తుడు లేచి మొదట మాట్లాడాడు. ఈయన కుమారులలో ఒకడు రూపధరుడి అనుచరుడు. ఫాలలోచనుడు చంపితిన్న వారిలో ఒకడు. ఈయన మరొక కుమారుడు

తందనాలు చేస్తున్నారు. మా నాన్నగారు లేని కారణంచేత మా ఇల్లు కుక్కలదొడ్డి అయి పోయింది. మా నాన్నగారు మన దేశానికి ఏమి ద్రోహం చేశాడని మేమీ శిక్ష అనుభ విస్తున్నామో నాకు తెలియటం లేదు. ఇది మీ అందరికీకూడా తలవంపులైన విషయమే!" అన్నాడు.

వెంటనే దుర్బుద్ధి అనేవాడు లేచి, "ధీరమతీ, నీవు చేసిన అక్షేపణకు అర్థం లేదు. తప్పంతా మీ అమ్మది అయి ఉండగా మమ్మల్ని దుయ్యబడతావెందుకు? మూడే ళ్లుగా మీ అమ్మ మమ్మల్నందరినీ మోస గించింది. ఆమె మాలో ప్రతి ఒక్కడికీ ఏదోవిధంగా ఆశ చూపెట్టింది. బట్ట నేయటం పూర్తికాగానే స్వయంవరం చేసుకుంటానన్నది. మూడేళ్లు వెళ్లి నాలుగో ఏడు నడుస్తున్నది. ఆ బట్టనేయటం పూర్తికాదు. రాత్రిపూట దివిటీ పెట్టుకుని, పగలు నేసినదంతా విప్పుతుంటే ఎలా పూర్తి అవుతుంది? ఆమెను పెళ్లాడగోరేవారి తరపున నేను చెబుతున్నాను విను. ఆమెను నీ ఇంటినుంచి పంపేసి తన ఇష్టంవచ్చినవాణ్ణి పెళ్లాడమను. ఆమె ఇలాగే మమ్మల్ని మోసగించ దలిచినట్టయితే, ఆమె ఎవరినో ఒకరిని పెళ్లాడినదాకా మేము నీ ఇల్లు వదిలేదిలేదు. ఇది ముమ్మాటికీ నిజం!" అన్నాడు.

"నేను నా కన్నతల్లిని ఇల్లువెడలగొట్టటం ఎన్నటికీ జరిగేపని కాదు. అదీ గాక ఆమె



మాకు తన తండ్రి వద్దనుంచి తెచ్చుకున్న భరణాన్ని తిరిగి ఇచ్చే స్థితిలో కూడా లేను," అన్నాడు ధీరమతి.

ఇంకొక వృద్ధుడు లేచి, "రూపధరుడు యుద్ధానికి బయలుదేరినప్పుడే నేను జోస్యం చెప్పాను. బయలుదేరిన ఇరవైసంవత్సరాలకు అతను చాలా కష్టాలుపడి తిరిగివస్తాడని చెప్పాను. ఇప్పటిదాకా నేను చెప్పినది అక్షరాలా జరుగుతున్నది. అతడు తప్పక వస్తాడు. అతని ఇంట చేరినవారికి రాబోయేవి చాలా చెడ్డ రోజులు!" అన్నాడు.

"నీ జోస్యాలు నీ కొడుకులకు చెప్పుకో. ఆమె మాకుకావాలి. నీ బెదిరింపులు లక్ష్యం లేదు. రూపధరుడే తిరిగివచ్చినా మమ్మల్ని

తన ఇంట నుంచి వెళ్లగొట్ట సాహసించలేడు," అని ఇంకొకడు ప్రగల్భాలు పలికాడు.

చివరకు ధీరమతి, "నేను చెప్పవలసిన మాట చెప్పేశాను. దయచేసి నాకు ఒక నౌక, ఇరవైమంది నావికులూ ఇప్పించి నట్టయితే నేను స్పార్టాకూ, పైలాస్‌కూ వెళ్లి నా తండ్రి వార్త తెలుసుకుని వస్తాను. ఆయన బతికి ఉన్నట్టు తెలిస్తే ఇంకొక్క ఏడాది పాటు ఈ దుర్మార్గాన్ని సహిస్తాను. అలా కాక మా తండ్రి పోయాడని రూఢిగా తెలిస్తే ఆయనకు ఉత్తరక్రియలు జరిపి మా అమ్మ పెళ్లి నేనే ఏర్పాటుచేస్తాను!" అన్నాడు.

సమావేశం ముగియగానే ధీరమతి ఇంటికి వెళ్లక సముద్ర తీరానికి వెళ్లాడు. అక్కడ అతనికి సహనుడు అనే ఆయన కనిపించాడు. ఈ సహనుడు రూపధరుడికి మొదటినుంచీ ఆప్తమిత్రుడు. ఆయన ధీరమతిని చూసి, "నాయనా! ఇవాళ నిన్ను చూసి నాకు చాలా ఆనందమయింది; ఆ తండ్రికి కొడుకు ననిపించావు. ఇథకాలో చాలా నౌకలున్నాయి. అన్నిటిలోకీ ఉత్తమమైన నౌకగా చూసి నీ ప్రయాణానికి సంపాదించి పెడతాను. ప్రయాణానికి కావలసిన నావికులనుకూడా నేనే పోగుచేసుకు వస్తాను. నువ్వు మాత్రం ఇంటికి వెళ్లి ప్రయాణ సంబారాలన్నీ పట్టించుకుని రా!" అన్నాడు.

ధీరమతి వెంటనే ఇంటికి వచ్చాడు. అతనిని చూడగానే అతని కొంప గుల్లచేస్తున్న దుర్మార్గులందరూ ఒకచోట చేరి వేళాకోళం సాగించారు.



"అమ్మ బాబోయ్, వీడు మన రక్తం తాగాలని చూస్తున్నాడురోయ్. ఇంతకాలమూ ఏమిటో అనుకున్నాం!" అన్నాడొకడు.

"వీడు పైలాస్, స్పార్టాలకు పోవటం ఎందుకో తెలుసా? సైన్యాలను తీసుకు రావటానికి!" అన్నాడు ఇంకొకడు.

"లేక ఇంత విషం తెచ్చి మన పానీయంలో కలిపేస్తాడో!" అన్నాడు మూడోవాడు.

"వాళ్ల నాన్నలాగే సముద్రాలమీద అదే పోత పోతాడేమో, అదికూడా ఆలోచించండి. వీడి ఆస్తి పంచుకోలేక మనం చావాలి!" అన్నాడు నాలుగోవాడు.

ధీరమతి వారి మాటలు పట్టించుకోక సామానుకొట్టువద్దకు వెళ్లి తనను పెంచిన దాసీతో తన ప్రయాణానికి కావలిసిన సంబారాలన్నీ సిద్ధం చేసి ఉంచమన్నాడు.

"నువ్వు వెళ్లకు, నాయనా! నువ్వు కూడా సముద్రాలమీద పోతే మీ అమ్మ ఏంకాను! ఈ ఆలోచన నీకెందుకు కలిగింది, నా తండ్రీ?" అని ముసలిది శోకాలుపెట్టింది.

"పెద్దమ్మా, ఇది దైవనిర్ణయం నువ్వు అడ్డాలు చెప్పకు. ఈ రాత్రి మా అమ్మ నిద్రపోయాక బయలుదేరి పోతాను. ఆవిడ అడిగితే తప్ప నా ప్రయాణంగురించి చెప్పనని ఒట్టువెయ్యి! ప్రయాణానికి కావలిసిన తిండీ మొదలైనవన్నీ సిద్ధంగా ఉంచు!" అన్నాడు ధీరమతి.

ఈలోగా సహనుడు వీధులన్నీ తిరిగి ప్రయాణానికి అవసరమైన నావికులను ఏరి సముద్రతీరానికి పంపాడు. మంచి నౌక కూడా దొరికింది. ఇంతలో పొద్దూకిపోయింది. రూపధరుడి ఇంట అందరూ తిని, తాగి నిద్రలకు పడ్డారు. ఆ సమయాన సహనుడు వచ్చి ధీరమతితో, "నాయనా, ప్రయాణానికి సర్వమూ సిద్ధంగా ఉన్నది. నువ్వు రావటమే ఆలస్యం!" అన్నాడు.

ఇద్దరూ కలిసి సముద్రతీరానికి వెళ్లారు. నావికులు ప్రయాణసంబారాలను రూపధరుడి ఇంటినుంచి తెచ్చి నౌకలోకి ఎక్కించారు. ధీరమతి నౌకలో ఎక్కాడు. నావికులు తెరచాప ఎత్తి, లంగరు పైకి లాగారు. అనుకూలమైన గాలికొడుతున్నది. నౌక పైలాస్‌కు బయలు దేరింది.

— (ఇంకా ఉంది)



# చందమామ కబుర్లు

## అతిచిన్నవి

మనలోక్‌సభకు ఎన్నికలు ఇప్పుడిప్పుడే జరిగాయి. దానితోపాటు కొన్ని రాష్ట్రాల శాసన సభలకు కూడా ఎన్నికలు జరిగాయి. కొన్నేళ్ళుగా రాష్ట్రపతి పాలనలో ఉన్న జమ్ము- కాశ్మీర్‌లో కూడా ఎన్నికలు జరిగాయి. మనదేశంలో అతిచిన్న పోలింగ్ స్టేషన్ ఆ రాష్ట్రంలోనే ఉన్నది. లడక్ జిల్లా హాన్‌ఫాలాలో తొమ్మిది మందికి మాత్రమే ఒక పోలింగ్ స్టేషన్ ఏర్పాటు చేయబడింది. ఆ ఊరు సముద్ర మట్టానికి 5,000 అడుగుల ఎత్తులో ఉన్నది.

ప్రపంచంలో అత్యధిక జనాభాగల దేశమైన చైనాలో భాగమైన టిబెట్‌లోని ఒక ఊళ్లో ముగ్గురు మాత్రమే నివసిస్తున్నారు. టిబెట్ రాజధాని లాసాకు 550 కి.మీ. ఆగ్నేయ దిశగా ఉన్న యూమెన్‌లో 72 ఏళ్ళ తండ్రి, ఇద్దరు కుమార్తెలు నివసిస్తున్నారు. ఇటీవలి వరకు తండ్రి ఆ ఊరిపెద్దగా ఉండేవాడు. ఇప్పుడు ఆ పదవిలో ఆయన పెద్దకూతురు ఉంటున్నది.

## చాలా ఎత్తయినది

మలేసియాలోని కోలాలంపూర్‌లో ప్రపంచంలో కెల్లా చాలా ఎత్తయిన భవనం పూర్తికానున్నది.' 'పెట్రోనాస్ టవర్స్' అనే ఈ భవనం పూర్తయ్యేనాటికి 445 మీ॥ ఎత్తు ఉంటుంది. భవనం మీద అమర్చే టీవీ ఆంటెనాతో కలుపుకుంటే ఈ ఎత్తు ఉంటుంది. అమెరికాలోని, చికాగో నగరంలో ఉన్న 'సియర్స్ టవర్' ఎత్తు 435 మీటర్లు.

## చాలా పెద్దది

చైనాలోని మరొక ప్రత్యేకత ఏమంటే - ఆసియా ఖండంలోనే అతి పెద్ద రైల్వేస్టేషన్ బీజింగ్‌లో ఉన్నది. ఒక్కసారిగా స్టేషన్‌లోకి 60 – 90 రైళ్లు వస్తూ పోతూ ఉంటాయి. ఒక్కరోజుకు 6,00,000 ప్రయాణీకులకు ఈ స్టేషన్ ఉపయోగపడగలదని భావిస్తున్నారు. జనవరి మూడవ వారంలో ప్రధాన మంత్రి లీ పెంగ్ ఈ స్టేషన్ ప్రారంభోత్స వానికి అధ్యక్షత వహించాడు. చైనా నాయకుడైన మావో టీ తుంగ్, బ్రహ్మాండమైన లోహ విగ్రహం కలిగిన 'మావో టీతుంగ్ ట్రైన్' ను జెండా ఊపి ప్రారంభించాడు. స్టేషన్ నిర్మాణానికి 20,000 మంది కార్మికులు మూడేళ్ళ పాటు కష్టపడి పని చేశారు.

ఆసియాలోని మరొక దేశమైన థాయ్‌లాండ్ రాజధాని బాంకాక్‌లో ప్రపంచంలో కెల్లా అతి పెద్ద రెస్టారెంట్ ఉన్నది. ఇది 3.34 ఎకరాల స్థలంలో విస్తరించి ఉన్నది. రాయల్ డ్రాగన్ అనే ఈ రెస్టారెంటులో 200 మంది పనిచేస్తు న్నారు. 540 మంది, మగ, ఆడ వెయిటర్లు, 325 మంది పెద్ద వంటగాళ్ళు ఉన్నారు. వెయిటర్లు 'రోలర్ స్కేట్స్' మీద తిరుగుతూ ఉంటారు. ఒక్కసారిగా 5,000 మంది ఇక్కడ కూర్చుని ఆహారం తీసుకోవచ్చు. ఈ హోటల్‌లో ఎప్పుడూ విపరీతమైన రద్దీ ఉంటుంది. ఇక్కడ గంటకు 3,000 వంటకాలు తయారుచేస్తారు. ఆహారం తీసుకునే చోటు పెద్దహాలు అను కునేరు! అలాకాకుండా విడివిడి భవనాలలో ఉన్నాయి.




# కాపలారాక్షసుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ఓర్పూ, పట్టుదలా చూస్తూంటే, పూనిన కార్యం సాధించేందుకు అవసరమైతే జీవిత కాలాన్నంతా ఈ భయంకరమైన శ్మశానం లోనే గడిపేందుకు సిద్ధపడినట్టు కనబడుతున్నది. అయితే, ఒక ముఖ్యమైన సంగతి: మనుషుల్లో అత్యంత స్వార్థపరులే కాక, తమకు మేలు కాకపోయినా, ఇతరులకు కీడు కలిగించే ద్రోహదుష్టబుద్ధులు కొందరుంటారు. నువ్వొకవేళ అలాంటివాడి చేతిలో చిక్కి ఇక్కడ ఎనలేని ఇక్కట్లకు గురి అవుతున్నావేమో నన్న అనుమానం కలుగుతున్నది. అదే నిజమైతే, నువ్వింతటితో నీ పట్టుదలకు స్వస్తి పలికి నీ రాజ్యానికి పోయి సుఖించడమే

**బేతాళ కథలు**




మేలు కాగలదు. నీకు తగు హెచ్చరికగా ఉండేందుకు గాను- ఆయాచితంగా తనకు లభించిన సంపదలతో అహంకరించి, సలహా కోరి వచ్చినవాడిని చిక్కులపాలు చేసిన చక్రధరుడనే ద్రోహబుద్ధి కథ చెపుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక ఊళ్ళో చక్రధరుడనే యువకుడున్నాడు. వాడికి నా అన్నవాళ్ళు లేరు. చిన్నతనంనుంచీ ఆ ఇంటా ఈ ఇంటా కష్టపడి పనిచేసి పొట్ట పోసుకునేవాడు. తీరిక సమయాల్లో ఆ ఊళ్ళోని పండితులనాశ్రయించి వారి మాటల ద్వారా కొంత శాస్త్రజ్ఞానాన్ని సంపాయించాడు.

ఆ ఊళ్ళోనే సౌదామిని అన్న యువతి ఉన్నది. ఒక రోజు ఆమెకు చిత్రమైన కల వచ్చింది. అందులో బైరాగి ఒకడు కనిపించి, "తగినవరుణ్ణి పెళ్ళి చేసుకుంటే నువ్వుఎన్నో సుఖాలననుభవిస్తావు," అని చెప్పాడు.

"తగిన వరుడెవరో నాకెలా తెలుస్తుంది?" అని అడిగింది సౌదామిని.

"ఆకాశంలో నక్షత్రాలెన్నని నువ్వడిగితే– మన పెళ్ళయ్యాక కలిసి కూర్చుని లెక్క పెడదామని ఎవడైతే అంటాడో– అతడే నీకు తగిన వరుడు!" అన్నాడు బైరాగి.

మెలకువ వచ్చాక సౌదామిని కలను గుర్తు చేసుకుని, తనకలాంటి కల ఎందుకు వచ్చిందా అని ఆశ్చర్యపడింది. ఇంట్లో ఎవరికీ కలను గురించి చెప్పలేదు.

ఆ రోజు మధ్యాహ్నం సౌదామిని, స్నేహితురాండ్రతో మామిడితోటకు వెళ్ళింది. అక్కడ అందరూ దాగుడుమూతలాడుతున్నారు. సౌదామిని ఒక చెట్టు చాటున దాక్కుంటూ చూడక అలా పోతున్న పాముతోకను తొక్కింది.

బుస్సుమంటూ పడగ విప్పింది పాము. ఏం జరిగిందో ఆమె తెలుసుకునే లోగా, ఎవరో చేయి పట్టుకుని ఆమెను దూరంగా లాగారు. పాము పడగ ముడిచి రివ్వున పాకుతూ పారిపోయింది.

అప్పుడు సౌదామిని తనను చేయి పట్టి లాగినదెవరా అని చూసింది. వాడు చక్రధరుడు.



వాడు సౌదామిని చేయి పట్టుకుని లాగిన తరవాత, ఆమె అందం చూసి ముగ్ధుడైపోయి అలా చూస్తూండిపోయాడు.

సౌదామినికి చక్రధరుడు తెలుసు. కానీ, అంత దగ్గరినుంచి చూడడం అదే మొదటి సారి. వాడు దేశ సంచారానికి మారువేషంలో వచ్చిన రాజకుమారుడిలా ఉన్నాడు.

"నా ప్రాణం కాపాడావు, కృతజ్ఞతలు," అన్నది సౌదామిని.

"నీ ప్రాణం కాపాడ్డం కోసమే నిన్ను తాకాను. జీవితంలో ఇంతవరకూ పొందని ఆనందం కలిగింది. నేనే నీకు కృతజ్ఞుణ్ణి," అన్నాడు చక్రధరుడు.

ఎంతో తెలివిగా మాట్లాడిన చక్రధరుడే తనకు తగిన వరుడేమోనని, సౌదామినికి అనుమానం కలిగింది.

ఆమె వెంటనే, "నువ్వు చాలా తెలివైన వాడిలా కనిపిస్తున్నావు. ఆకాశంలో నక్షత్రాలెన్నో చెప్పగలవా?" అని ప్రశ్నించింది.

"చెప్పగలను కానీ, చెబితే నీకు కోపం వస్తుందని భయంగా ఉంది!" అన్నాడు చక్రధరుడు.

"కోపం రాదు, చెప్పు," అని హామీఇచ్చింది సౌదామిని.

"చాలా ఏళ్ళు కష్టపడి, మొత్తంమీద నక్షత్రాలన్నీ లెక్కపెట్టాను. అంతా అయ్యాక ఒకటి రెండు నక్షత్రాలను మర్చిపోయానని అనుమానం వచ్చింది. ఇంకోసారి లెక్కబెట్టాలంటే విసుగ్గా ఉంది. నాలాగే నక్షత్రాల లెక్కంటేఆసక్తిఉన్న అమ్మాయిని పెళ్ళి చేసుకుని - ఇద్దరం కలిసిలెక్కపెట్టాలని ఉంది," అన్నాడు చక్రధరుడు.

ఈ సమాధానం వింటూనే, వాడే తనకు తగిన వరుడని గ్రహించడంతో, సౌదామినికి సిగ్గు ముంచుకువచ్చి, తుర్రుమంటూ అక్కడి నుంచి పారిపోయింది.

ఆమె ఇల్లు చేరుకునే సరికి అక్కడ శశికాంతుడనే వాడున్నాడు. వాడు సౌదామినిని ప్రేమించాడట.

ఆమెను తనకిచ్చి పెళ్ళిచేస్తే, వెయ్యి బంగారుకాసులిస్తానని, సౌదామిని తల్లిదండ్రులకు ఆశ పెడుతున్నాడు. అది వాళ్ళకు



ఇష్టమైనట్టుగా ఉంది. కొద్దిసేపటి తర్వాత శశికాంతుడు వెళ్ళిపోగానే, సౌదామిని తల్లి దగ్గరకు వెళ్ళి తనకు వచ్చిన కల గురించీ, తోటలో జరిగిందీ చెప్పి, తను చక్రధరుణ్ణే పెళ్ళి చేసుకుంటా నన్నది. తల్లి ఈ విషయం తండ్రికి చెప్పింది.

ఇది విన్న సౌదామిని తండ్రి, "కలా గిలా అన్నీ వట్టివి. ఆ చక్రధరుడు ఎర్రగా బుర్రగా ఉన్నాడని, మన పిల్ల మోజు పడుతున్నది. ఎర్రని ఏగానీ లేనివాడికి పిల్లనెలాగిస్తాం? నేను సౌదామినిని శశికాంతుడికే ఇచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు పట్టుదలగా.

తండ్రి పట్టుదల గురించి సౌదామినికి తెలుసు. అందుకని ఆమె, "నా కల అబద్ధం కాదని ఋజువు చేసుకునే అవకాశమివ్వండి. ఒక ఏడాది పాటు నా పెళ్ళి వాయిదా వెయ్యండి. ఈలోగా చక్రధరుడు శశికాంతుడి దగ్గర ఉన్నదానికంటే ఎక్కువ డబ్బు సంపాదిస్తే, అతడితో నా పెళ్ళి జరిపించండి," అన్నది తల్లిదండ్రులతో.

దీనికామె తండ్రి పెద్దగా నవ్వి, "చక్రధరుడు ఒక్క ఏడాదిలో లక్షవరహాలు సంపాదించగలడా? ఇప్పటికే శశికాంతుడి దగ్గర లక్ష వరహాలున్నాయని తెలియక, ఈ మాటలంటున్నావు," అన్నాడు.

"అతడు నాకు తగిన వరుడైతే తప్పక సాధించుతాడు. నా కల నిజమని ఋజువవుతుంది!" అన్నది సౌదామిని ఎంతో నమ్మకంగా.

తండ్రి సరేనన్నాడు. సౌదామిని, చక్రధరుడికి కబురందజేసింది.

చక్రధరుడికి సౌదామినిని పెళ్ళాడి తీరాలన్న పట్టుదల పెరిగింది. వాడు ఎలాగో అలా డబ్బు సంపాదించాలని ఊరు విడిచి పట్నం వెళ్ళాడు. అక్కడ రకరకాల పనులు చేశాడు. నెలలు గడిచినా, వాడివద్ద వెయ్యి వరహాలు కూడా చేరలేదు. లక్షవరహాలు సాధించడం తన వల్లకాదని వాడు నిస్పృహ చెందాడు.

అలాంటి పరిస్థితిలో- ఒకరోజున, బైరాగి ఒకణ్ణి పొడిచేందుకు వెంటబడిన ఆబోతు నుంచి చక్రధరుడు కాపాడాడు.

బైరాగి ఎంతో సంతోషించి, వాడి వివరాలడిగి తెలుసుకుని, "నాయనా, ఇంత తక్కువ వ్యవధిలో బోలెడు డబ్బు సంపాదించడానికి, ఒకే ఒక్క మార్గ ముంది. అయితే చాలా ప్రమాదకరమైనది. సాహసించగలవా?" అన్నాడు.

ఆ ప్రయత్నంలో తన ప్రాణాలు పోయినా సిద్ధమేనని చక్రధరుడు చెప్పాడు.

పట్టణానికి ఆమడ దూరంలో అడవి ఉన్నది. అందులోని కొండలో ఒక గుహ ఉన్నది. ఆ గుహలో నిధి ఉన్నది. ఆ నిధిలో కొన్ని కోట్ల వరహాలున్నాయి. అయితే, ఆ నిధిని అన్ని వేళలా ఒక రాక్షసుడు కాపలా కాస్తూంటాడు. వాడిని తప్పించుకుని నిధిని స్వాధీనం చేసుకోవడం ఇంచుమించు అసాధ్యం!

బైరాగి చెప్పిన వివరాల ప్రకారం చక్రధరుడు. అప్పటికప్పుడే బయలుదేరిఅడవిలోకి వెళ్ళాడు. అక్కడ కొంతసేపు వెదికినిధి ఉన్న గుహను చేరుకున్నాడు.

గుహ ముందు పెద్దబండలా కూర్చుని నిద్ర పోతున్నాడు రాక్షసుడు.

రాక్షసుణ్ణి చూడగానే చక్రధరుడికి గుండెలవిశాయి. అయినా, వాడు తెగించి గుహను సమీపించేసరికి, రాక్షసుడు చప్పున లేచి, వాణ్ణి చేత్తో పట్టుకుని, "నన్నే ఏమార్చాలనుకున్నావురా? హుఁ!" అంటూ హుంకరించాడు.



చక్రధరుడు ధైర్యం కూడగట్టుకుని, రాక్షసుడికి తన కథ చెప్పుకున్నాడు.

"అయితే, నిన్ను బైరాగి పంపాడన్నమాట!" అంటూ రాక్షసుడు తృప్తిగా తలాడించి, చక్రధరుడికి తన కథ చెప్పాడు.

రాక్షసుడు చెప్పిన ప్రకారం, సౌదామిని పూర్వజన్మలో వాడి కూతురు. ఆమెనుఇష్టం లేనివాడికిచ్చి పెళ్ళిచేశాడు.

సౌదామిని ఆత్మహత్య చేసుకున్నది. కూతురును ఇష్టంలేని వాడికిచ్చి వివాహం చేసినపాపానికి, ఈజన్మలో వాడు రాక్షసుడుగా పుట్టాడు. తెలిసి కూడా ఇష్టంలేని పిల్లను పెళ్ళాడినందుకు ఆమె భర్త ఈ జన్మలో బైరాగిగా పుట్టాడు. ఇద్దరికీ పూర్వజన్మ



జ్ఞానముంది! గత జన్మలో చేసిన తప్పును దిద్దుకునేందుకు ఇద్దరూ ప్రయత్నిస్తున్నారు. బైరాగి, సౌదామినికి కలలో కనిపించి, ఆమెకూ, చక్రధరుడికీ పరస్పరం ప్రేమ పుట్టేలా చేశాడు. ఎందుకంటే, గతజన్మలో ఆమె ఇష్టపడినవాడే చక్రధరుడు!

ఇది విన్న చక్రధరుడు చాలా సంతోషించి, "అయితే, నువ్వు నాకు సాయపడుతున్నా వన్నమాట!" అన్నాడు.

"తప్పక సాయపడతాను. కానీ, నాకో ఉప కారం చేయాలి," అన్నాడు రాక్షసుడు.

"నీ అంతటి వాడికి నేనేం ఉపకారం చేయగలను?" అన్నాడు చక్రధరుడు ఆశ్చర్య పోతూ.

"విను! నేను నీకు రెండు లక్షల వరహా లిస్తాను. నీకూ, సౌదామినికీ పెళ్ళి జరుగు తుంది. ఏడాదిలోగా, ఇంకెక్కడైనా మరొకచోట ఇష్టంలేని పెళ్ళి జరిగేలా చూడు!" అన్నాడు రాక్షసుడు.

"అందువల్ల నీకేం లాభం?" అని అడి గాడు చక్రధరుడు.

రాక్షసుడు ఒక్కక్షణం ఆగి, "కుళ్ళంకలకు పోక సావధానంగా విను! ఈ గుహలో ఉన్న నిధికి తరుగు లేదు. ఇందులోంచి ఎంత డబ్బు తీస్తామో, అంత మొత్తం తిరిగి మళ్ళీ అందులో చేరుతూంటుంది. అందుకని, ఈ నిధికి రాత్రింబవళ్ళనక కాపలా అవసరం. ఈ జన్మలో సౌదామిని, శశికాంతుణ్ణి పెళ్ళి చేసుకుని ఉంటే, బలవంతంగా కూతురికి ఇష్టంలేని పెళ్ళిచేసినందుకు, ఆమె తండ్రి మరుజన్మలో రాక్షసుడై నా స్థానం ఆక్రమించే వాడు. అలాగే శశికాంతుడు రానున్న జన్మలో బైరాగిస్థానం తీసుకునేవాడు. ఇష్టం లేని పెళ్ళి జరిగితే తప్ప నాకూ, బైరాగికీ ఈ రూపాల నుంచి విముక్తి లేదు. విన్నావా? అదీ సంగతి!" అన్నాడు.

చక్రధరుడు సంశయిస్తూనే, "ఇష్టంలేని పెళ్ళి మరెక్కడా జరక్కపోతే?" అన్నాడు.

ఆ ప్రశ్నకు రాక్షసుడు చెట్లకొమ్మలూ, గుహా దద్దరిల్లేలా నవ్వి, "వెర్రినాయనా, లోకంలోఇష్టంలేనిపెళ్ళిళ్ళు జరగడంఅపురూప మనుకుంటున్నావా? అసలు సంగ తేమంటే-

నీకూ, సౌదామినికీ పెళ్ళి జరిగేలా చేస్తున్నాం కదా? ఆ పుణ్యం వల్ల నాకూ, బైరాగికీ విముక్తి దగ్గరయినట్లే! ఈ గుహలో తరగని నిధి ఉన్నది. అందువల్ల దీని కాపలా కోసం ఎవరో ఒకరు ఇష్టంలేని పెళ్ళికి పూనుకో వలసిందే!" అన్నాడు.

"సరే, అయితే నా ప్రయత్నం నేను చేస్తాను," అన్నాడు చక్రధరుడు.

"మంచిది, అలాగే చెయ్యి. ముందు నువ్వు ఇక్కడినుంచి బయలుదేరి ఇంటికి వెళ్ళు. నీ ఇంట్లో రెండు లక్షల వరహా లుంటాయి. నీ కోరిక ప్రకారం, సౌదామినిని పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండు. నాకిచ్చిన మాట మాత్రం మరిచి పోకు," అన్నాడు రాక్షసుడు.

ఆ తర్వాత అంతా రాక్షసుడు చెప్పినట్లే జరిగింది.

సౌదామినీ, చక్రధరుల పెళ్ళి జరిగిన ఆరు నెలలకు, వసుదత్తుడనేవాడు చక్ర ధరుడింటికి వచ్చి, "నా కుమార్తె గతిలేనివాణ్ణి పెళ్ళి చేసుకుంటానంటున్నది. అది నాకిష్టం లేదు. ఒకప్పుడు నువ్వూ ధనహీనుడివే కదా! నా కుమార్తె ప్రేమించిన పేదవాడు కూడా నీలాగే ధనవంతుడయ్యే మార్గం చెప్పవా?" అని అడిగాడు.

"ఈ విషయం నువ్వు కాదు, నీ కుమార్తె ప్రేమించినవాడు అడగాలి," అన్నాడు చక్ర ధరుడు విసుగ్గా.

"వాడు దేనికీ ఒప్పుకోవడం లేదు. నన్ను నన్నుగా ఇష్టపడితేనే పెళ్ళి. ఎలాంటి



షరతులకూ ఒప్పుకోనంటున్నాడు," అన్నాడు వసుదత్తుడు.

"నీ కుమార్తె ఏమంటున్నది?" అని అడిగాడు చక్రధరుడు.

"దానికీ డబ్బక్కర్లేదుట!" అన్నాడు వసుదత్తుడు.

చక్రధరుడు కొంచెంసేపు ఆలోచించి, "చిన్నపిల్ల, తెలియనితనం. ఈ ప్రపంచమంతా డబ్బులో ఉంది. నువ్వు నీ కుమార్తె మాటలు పట్టించుకోకు, ఆ పేదవాడితో పెళ్ళి జరిపించకు. సౌదామినీ, నేనూ సుఖంగా ఉన్నామంటే అందుకు డబ్బే కారణం!" అన్నాడు చక్రధరుడు.

వసుదత్తుడు సంతోషంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వసుదత్తుడికి చక్రధరుడిచ్చిన సలహా ద్రోహబుద్ధితో కూడినదని తెలుస్తూనే ఉన్నదికదా? ఇష్టంలేని పెళ్ళికి బలవంతపెట్టడం వల్ల, వసుదత్తుడి కూతురు ఆత్మహత్య పాలయ్యే అవకాశం ఉంది. తనకుఏ మాత్రం మేలు కానిదీ, ఇతరులకు ఎంతో కీడు కలిగించేదీ అయిన సలహాను చక్రధరుడెందుకు ఇచ్చాడు? ఈసందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తనకు ఉపకారం చేసిన కాపలారాక్షసుడికి ప్రత్యుపకారం చేయవలసిన బాధ్యత చక్రధరుడికున్నది. అలా చేస్తానని వాడు మాట ఇచ్చాడు కూడా. ఆడిన మాట తప్పడం పాపకారణమవుతుంది. వసుదత్తుడి మీద జాలి పడి, చక్రధరుడు పాపం మూట కట్టుకోనవసరం లేదు. ఎందుకంటే- రాక్షసుడి గుహకున్న ఆకర్షణశక్తి ప్రభావం వల్ల, అక్కడ కాపలా కాయడానికి అన్ని కాలాల్లోనూ ఎందరో ఆడపిల్ల తండ్రులు పోట ీడుతూనే ఉంటారు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: జొన్నలగడ్డ రామలక్ష్మి రచన]



## సముద్రతీర ప్రయాణాలు-7

# గోవా

రచన: మీరానాయర్ ◆ చిత్రాలు: గౌతమ్‌సేన్




పరశురాముడు దుష్టపాలకులను శిక్షించిన తరవాత, తపస్సు చేయడానికి ప్రశాంత ప్రదేశం కావాలనుకుని బాణం వదిలాడు. ఈ బాణం వెళ్ళి పశ్చిమ సముద్రంలో పడింది. బాణం పడిన చోట నీళ్ళు వైదొలగడంతో భూభాగం పైకి వచ్చింది. అదే ఈనాటి అరేబియా సముద్రంలోని గోవా అని ఒక పురాణకథచెపుతుంది.

గోవాపూర్ అని పిలువబడిన గోవా-క్రీ.పూ 3వ శతాబ్దం నుంచే అరబ్ వ్యాపార కీలక మార్గంలోని ముఖ్యమైన రేవుపట్టణంగా ప్రసిద్ధి గాంచిందని పురాతత్వ శాఖ జరిపిన పరిశోధనల వల్ల తెలియవచ్చింది. క్రీ.శ 15వ శతాబ్దం వరకు పలు హైందవ వంశస్థులు దీనిని పరిపాలించారు. ఇది 15వ శతాబ్దంలో బిజాపూర్ అదిల్ షాహీ వంశ స్థాపకుడైన అదిల్ షా వశమయ్యింది. దీనిని 1510వ సం॥లో పోర్చుగీసులు వశపరచుకున్నారు. 1961వ సం॥లో ఇది సమైక్య భారతదేశంలో అంతర్భాగ మయ్యేంత వరకు అంటే 451 సంవత్సరాలు దీనిని పోర్చుగీసులు పరిపాలించారు.



అల్ఫోన్సో డీ అల్బుక్వెర్క్
**1510లో గోవాను పట్టుకున్నాడు**

గోవాకు 105 కి.మీ. పొడవు గల సముద్రతీరం ఉన్నది. ఉత్తరంగా టెరిఖోల్‌నుంచి, దక్షిణంగా పోలేం వరకు రాతి పత్రలూ, చిన్న గుట్టలూ మధ్య విస్తరించిన ఇసుక మైదానాలు కనిపిస్తాయి. సముద్రం వైపు నుంచీ, నదీమార్గాల నుంచీ రక్షణ కోసం పోర్చుగీసులు ఒక్కొక్క గుట్టమీద ఒక్కొక్క కోట నిర్మించారు.



ఈ కోటలన్నింటిలోకీ చాలా ఆకర్షణీయమైనది అగ్వాడా కోట. అగువా అంటే నీరు. ఈ కోట లోపల మంచినీటి బుగ్గలు చాలా ఉన్నాయి. హిందూమహాసముద్రంలో చాలా దూరం ప్రయాణం చేసి మండోవీ నదీముఖాన్ని చేరే ఓడలకు ఈ అగ్వాడా కోట స్థావరం

బుగ్గల నుంచే త్రాగునీటి సరఫరా జరిగేది. అగ్వాడా, రీజ్‌మెగోస్ కోటలు పోర్చుగీసుల పరిపాలనా కాలంలో లాగే ఇప్పుడు కూడా చెరసాలలుగానే ఉంటున్నాయి.

కోటల మధ్య గోవాలో ప్రసిద్ధమైన గోల్డన్ బీచెస్ అనే సముద్ర తీరాలు ఉన్నాయి. హర్మాల్, చపోరా, వెగేటర్, అన్జూనా, బాగా, కాలాంగ్యూట్, గాస్పర్ డయాస్, దోనాపొలా తీరాలు ఉత్తరగోవాలో ప్రసిద్ధమైనవి. ఆర్చ్ (ద్వారతోరణ) ఆకారంలో ఉన్న కాలాంగ్యూట్ బీచ్, 'క్వీన్ ఆఫ్ బీచెస్'గా ప్రసిద్ధి గాంచింది. ఇక్కడికి అధిక సంఖ్యలో పర్యాటకులు వస్తూ ఉంటారు. దీనికి దక్షిణంగా డోనా పొలా అనే బీచ్ ఉన్నది. ఒకప్పటి వైస్రాయ్ కూతురుపేరు మీదుగా దీనికా పేరు వచ్చింది. తాను కోరిన మత్స్యకారయువకుణ్ణి వివాహ మాడడానికి తల్లిదండ్రులు అనుమతించక పోవడంతో దోనాపొలా గుట్టపై నుంచి కిందికి దూకి ప్రాణాలు విడిచింది. అందుకే ఈ బీచ్‌కి ఆమె పేరు వచ్చింది.

కాలాంగ్యూట్‌కు ఉత్తరంగా బాగా బీచ్ శిఖరం మీద ప్రశాంతమైన 'రిట్రీట్‌హౌస్' ఉన్నది. ఈ చిన్న చర్చికి వెళ్ళే మార్గంలో 'శిలువ మార్గాన్ని' సూచించే అందమైన దృశ్యాలు ఉన్నాయి.


డోనా పొలా భూప్రదేశం చిత్తర

పానాజీకి దాదాపు తొమ్మిది కి.మీ ఎగువ ఉన్న వెల్హా (పాత) గోవా 16వ శతాబ్దంలో గోవాకు రాజధానిగా ఉండేది. ఆ రోజులలో సౌందర్యంలో అది లిస్బన్‌కు దీటుగా ఉండేది. ఓడ రేవుకు సమీపంలో గోవాకు సింహ ద్వారంగా వైస్రాయ్ ఆర్చ్ ఉన్నది. అధికారం స్వీకరిం చడానికి ముందుప్రతి వైస్రాయ్ ఈ తోరణం గుండా వెళ్ళ వలసిఉండేది యూరప్ నుంచి ఇండియాకు సముద్ర మార్గం కనుగొన్న వాస్కోడా


సె కెథడ్రల్

సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్

గామా స్మారకార్థం ఈ ద్వారతోరణం నిర్మించబడింది. తోరణానికి ఆవల రోమునగరంలోని సెయింట్ పీటర్స్ బాసిలికాను పోలిన సెయింట్ కాజెటాన్ చర్చ్ ఉన్నది.

సెయింట్ కాజెటాన్ చర్చ్‌కి ఎదురుగుండా ఆసియాలో అతి ప్రాచీనమైన పెద్ద చర్చ్‌లలో ఒకటైన సె కెథడ్రల్ ఉన్నది. మృదువైన ఘంటానాదానికి ప్రసిద్ధిగాంచిన 'సెనోడో ఔరో' బంగారు గంట ఇక్కడే ఉన్నది.దీనికి కొంతదూరంలో సెయింట్‌ఫ్రాన్సిస్ జేవియర్ చర్చ్ అని కూడా పిలువబడే బోమ్ జేసస్ బాసీలికాఉన్నది. గోవా ప్యాట్రన్ సెయింట్ -సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ భౌతిక కాయం భద్రపరచి ఉండడంవల్ల ఇది గోవాలోని చాలా ముఖ్యమైన చర్చ్‌గా పేరు గాంచింది. సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్, స్పెయిన్ దేశంలోని నవారేలో 1506వ సం॥లో జన్మించాడు. ఆయన కాలేజీలో చదువుతున్న రోజులలోనే సహ విద్యార్థి అయిన, ఇగ్నేషియస్ లయోలా చేత తీవ్రంగా ప్రభావితుడై, తన జీవితాన్ని దేవుడి సేవకు అంకితం చేశాడు. ఆయన 1542 మే 6వ తేదీ గోవాకు వచ్చాడు. ఆయన అక్కడ పోర్చుగీసు, కొంకణ భాషలలో క్రైస్తవమత ప్రచారం ప్రారంభించాడు. అక్కడ కొన్ని నెలలు మాత్రమే ఉండి, కోరమండల్ తీరం, శ్రీలంక, మలాకా, మొలుకాస్, జపాన్ ఆఖరికి చైనాకు వెళ్ళి అక్కడి 'సంఛియన్' దీవిలో 1552 డిసెంబర్ 3వ తేదీన మరణించాడు. పాతిపెట్టిన ఆయన భౌతికకాయాన్ని రెం.ు సంవత్సరాల తరవాత తవ్వి చూస్తే చెక్కు చెదరకుండా అలాగే ఉన్నది. దానిని అక్కడి నుంచి గోవాకు తీసుకువచ్చారు.పరిమాణంలో కొంత తగ్గినా, ఇప్పటికీ భద్రంగా ఉన్న జేవియర్ భౌతికకాయాన్ని, పదేళ్ళకోసారి బోమ్‌జేసస్ నుంచి సే కెథడ్రల్‌కు భక్తిశ్రద్ధలతో ఊరేగింపుగా తీసుకుని వెళతారు. ఈ ఊరేగింపును



బోమ్ జేసస్ బాసిలికా





గోవా వ్యావసాయిక రాష్ట్రం, ప్రధానపంట వరి.

తిలకించడానికి ప్రపంచం నలుమూలలనుంచీ లక్షలాది మంది భక్తులు వస్తారు.

బోమ్‌జేసస్‌కు ఎదురుగా ఉన్న కొండమీద సెయింట్ మోనికా కాన్వెంట్ ఉన్నది. తూర్పు ఆసియాలోని ప్రాచీనమైన అతిపెద్ద 'నన్నెరీ' (సన్యాసినుల మఠం) ఇది.

గోవా రాజధాని పానాజీ మాండోవీనది దక్షిణ తీరంలో ఉన్నది.



ఏబ్ ఫరియా విగ్రహం

రాష్ట్రంలో అతి పురాతనమైనదీ, ఒకప్పటి ఆదిల్ షా భవనమూ అయిన కట్టడమే ఇప్పుడు పాత రాష్ట్ర సచివాలయంగా ఉంటున్నది. దీనికి ఎడమవైపుగా ఒక స్త్రీకి హిప్నాసిస్ ద్వారా స్వస్థత సమకూరుస్తున్న భంగిమలో ఏబ్ ఫరియా కాంస్య విగ్రహం ఉన్నది. ఏబ్ ఫరియాగా ప్రసిద్ధిగాంచిన ఫాదర్ జోస కస్టోడియో డీ ఫరియా – పూజారి, పండితుడు, వైజ్ఞానికుడు.. అయన యువకుడుగా ఉన్నప్పుడే పోర్చుగల్‌కు వెళ్ళిపోయాడు. 'ఫాదర్ ఆఫ మెస్మరిజం'గా పేరుగాంచిన ఆయన, హిప్నాసిస్‌ను ఒక విధమైన సైన్సుగా నిరూపించడానికి ప్రయత్నించిన మొట్ట మొదటి పండితుడు. సుప్రసిద్ధ రచయిత అలెగ్జాండర్ డ్యూమా 'ది కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో' అనే నవలలో ఆయన్ను 'మ్యాడ్ మాంక్' అనే పాత్రగా చిత్రించాడు.

పానాజీకి ఆగ్నేయ దిశగా సుప్రసిద్ధమైన మంగేషి శివాలయం ఉన్నది. మనస్తాపంతో కైలాసాన్ని వదిలి పెట్టిన - పరమశివుణ్ణి వెతుక్కుంటూపార్వతీదేవి - ఇక్కడికి వచ్చిందట. ఆమె అరణ్యం గుండా వెళుతూ ఒక పులి ఎదురవడంతో భయపడి, "పాహిమాం గిరీశ!" అని శివుణ్ణి ప్రార్థించిందట. శివుడు ప్రత్యక్షమైన చోట మాంగిరీశ మందిరం వెలిసిందని చెబుతారు. అదే కాల క్రమేణా మాంగ్రీషాగా, వహాంగిషిగా వ హా ం ం ద్ ని అంటారు.



శ్రీ మాంగేష్ దేవాలయం



# కడుపు తీపి

బదరికవనంలో శ్రీనాథుడనే పండితుడు గురుకులం నడిపేవాడు. ఆయన శిష్యులలో గదాధరుడు, విద్యాధరుడు అనేవారు బాగా స్నేహంగా వుండేవారు.

చదువైపోయాక మిత్రులిద్దరూ విడిపోయారు. గదాధరుడు తన గ్రామానికి వెళ్ళి అక్కడ పాఠశాల స్థాపించాడు. చక్కగా పాఠాలుచెబుతాడని అతడికి పేరు వచ్చింది. అతడికి సంపాదన బాగుందని ఒకాయన, దమయంతి అనే తన కూతుర్నిచ్చి పెళ్ళి చేశాడు. కొన్నాళ్ళకు దమయంతి పండంటి మగబిడ్డను కన్నది. ఆ బిడ్డకు సుందరుడని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచుకుంటున్నారా దంపతులు.

సుందరుడికి రెండేళ్ళు నిండినప్పుడు, విద్యాధరుడు తన భార్య అనసూయనూ, రెండేళ్ల కొడుకు చంద్రుణ్ణీ వెంటబెట్టుకుని గదాధరుడింటికి వచ్చాడు. గదాధరుడు, విద్యాధరుడు ఎంతోకాలం తర్వాత కలుసుకున్న సంతోషంలో వున్నారు. ఒకరి వివరాలొకరు అడిగి తెలుసుకున్నారు. గదాధరుడు తన సంగతి చెప్పాక విద్యాధరుడు తను పట్నంలో వ్యాపారం ప్రారంభించి బాగా ఆర్జిస్తున్నట్లు చెప్పాడు. గదాధరుణ్ణి ఒకసారి పట్నం రమ్మన్నాడు.

మిత్రులిలా మాట్లాడుకుంటూంటే, వాళ్ళ భార్యలు తమ కబుర్లలో వున్నారు. ఎవరూ పిల్లలను పట్టించుకోలేదు. అంతలో చంద్రుడు పెద్ద కేక పెట్టాడు. జరిగిందేమిటంటే – సుందరుడు, చంద్రుణ్ణి కొట్టాడు.

విద్యాధరుడు చప్పున చంద్రుణ్ణి ఎత్తుకుని, "గదాధరా! నీ కొడుక్కు చేతి వాటు తనముంది. పిల్లలకిది మంచి లక్షణం కాదు," అన్నాడు.

గదాధరుడు నవ్వుతూ, "వాడికి ఊహ ఎక్కువే కానీ ఎంత చెప్పినా చేతివాటు



తనం పోవడం లేదు. చిన్నపిల్లలకు దూరంగా వుంచుతూంటాం. ఇవ్వాళ మర్చిపోయాం," అన్నాడు.

"నవ్వుతావేమిటి? ముందు ఆ అలవాటు మానిపించు," అన్నాడు విద్యాధరుడు కోపంగా.

"రెండేళ్ళ వయసువాడికి ఏం చెబితే మాత్రం అర్థమవుతుంది?" అన్నాడు గదాధరుడు ఇంకా నవ్వుతూనే. విద్యాధరుడు చిరాకు పడుతూ, "మా చంద్రుడికీ ఇలాంటి అలవాటుండేది. ఏడాది వయసులోనే ఒక్కటిచ్చాను. మళ్ళీ మా వాడు అల్లరి చెయ్యలేదు, ఎవర్నీ కొట్టలేదు," అన్నాడు.

అప్పటికి అర్థమయింది గదాధరుడికి– ఇదంతా తన మిత్రుడు సరదాగా అనడం లేదని. అతడు కాస్త నొచ్చుకుని, "మా వాడు చాలా తెలివైనవాడు. కథ చెబితే అర్థమవుతుంది. పాట పాడితే తెలుస్తుంది. కానీ దుడుకుతనం గురించి ఎంత చెప్పినాఅర్థం కాదు. అయినా రోజూ చెబుతూనే వుంటాను. బహుశా ఒకటి రెండేళ్ళలో అది కూడా అర్థమవుతుందనుకుంటాను," అన్నాడు.

"ఏమో! నీ కొడుకు వాటం చూస్తూంటే, వాడికెవరూ బుద్ధి చెబుతున్నట్లు లేదు!" అన్నాడు విద్యాధరుడు.

ఆ మర్నాడే విద్యాధరుడి కుటుంబం వెళ్ళిపోయింది. కానీ, గదాధరుడికి తన కొడుకు గురించి బెంగపట్టుకున్నది. విద్యాధరుడంటే అతడికి ఆరాధనాభావముండడం వల్ల– కొడుకు బాగుకోసం ఆ రోజునుంచి పద్ధతి మార్చాడు. సుందరుడు కాస్త అల్లరిచేస్తే చాలు, వాణ్ణి విపరీతంగా కొట్టేవాడు. అందువల్ల వాడి అల్లరితనం తగ్గలేదు కానీ, వాడు తండ్రి దగ్గరకు రావడం మానేశాడు. తండ్రిని చూస్తే చాలు భయంతో వణికిపోయేవాడు.

ఇది జరిగిన కొద్దిరోజులకు గురువు శ్రీనాధుడు, గదాధరుడి ఇంటికి వచ్చాడు. ఆయన అతడితో, "శిష్యుడు తనయుడితో సమానం. నీ కొడుకు నాకు మనుమడు. వాణ్ణి చూడాలని వున్నది, తీసుకురా!" అన్నాడు.

అప్పుడు గదాధరుడు భార్యను పిలిచి తను బయటికి వెళ్ళిపోయాడు. శిష్యుడలా వెళ్ళిపోవడం చూసి శ్రీనాధుడాశ్చర్యపోయాడు.

ఆయన సుందరుణ్ణి ముద్దులాడుతూ శిష్యుణ్ణి రమ్మని పిలిచాడు. "ఆయనరారు. ఆయన్ను చూస్తే సుందరుడు వణికిపోతాడు," అంటూ దమయంతి జరిగిందంతా గురువుకు చెప్పింది.

అప్పుడు శ్రీనాధుడు, గదాధరుణ్ణి పిలిచి, "నీకు మతిపోయిందా? ఎవరి మాటో పట్టుకుని, నీ కన్నబిడ్డ పట్ల రాక్షసుడిలా ప్రవర్తిస్తావా?" అంటూ మందలించాడు.

గదాధరుడు వినయంగా, "గురువర్యా! విద్యాధరుడెవరోకాడు, నాకు ఆదర్శప్రాయుడైన స్నేహితుడు. వాడి ప్రతిమాట వెనకా ఎంతో ఆలోచనవుంటుందని అనుభవ పూర్వకంగా నాకు తెలుసు," అన్నాడు.

ఇందుకు శ్రీనాధుడు చిన్నగా నవ్వి, "విద్యాధరుడి ఆలోచనాశక్తి గురించి నీ కంటే నాకు బాగా తెలుసు. కానీ నీకు కొందరి కడుపుతీపి గురించి బొత్తిగా తెలియదు. ఈ ప్రపంచంలో ఎన్నో నేరాలు, ఘోరాలు అలాంటి కడుపుతీపి వల్లనే జరుగుతున్నాయి. విద్యాధరుడి మాటలకు విలువివ్వకు. పిల్లలు దెబ్బలకు కాక మంచిమాటలకే లొంగుతారు. సుందరుడు అల్లరి చేస్తే తప్పని చెప్పడం మాత్రం మరవకు," అన్నాడు.

గదాధరుడికింకా అనుమానం వదలలేదు. అదిగ్రహించిన శ్రీనాధుడు, "పద, మనమిద్దరం వెళ్లి విద్యాధరుణ్ణి చూసి వద్దాం. నీఅనుమానం పూర్తిగా తొలిగిపోతుంది," అన్నాడు.



గదాధరుడందుకు సరేనన్నాడు. మర్నాడిద్దరూ ఉదయాన బయల్దేరి చీకటి పడేవేళకు పట్నంలో విద్యాధరుడింటికి చేరుకున్నారు. విద్యాధరుడు గురువునూ, మిత్రుణ్ణీ అప్యాయంగా ఆదరించాడు.

మాటల సందర్భంలో శ్రీనాధుడు, గదాధరుడి కొడుకు సుందరుడి ముద్దుచేష్టల గురించి చెప్పడం ప్రారంభించాడు. విద్యాధరుడు అసహనంగా, "అల్లరిపిల్లలు నాకు ముద్దురారు. సుందరుడి అల్లరి నేను ఈ జన్మకు మరిచిపోలేను," అన్నాడు.

"నాయనా! హంస పాలు, నీరు వేరుచేసి ఆనందిస్తుంది. మనిషి పిల్లల ముద్దు చేష్టల్ని అల్లరినుంచి వేరు చేసి ఆనందించలేడా?"

అన్నాడు శ్రీనాధుడు. అప్పటికి విద్యాధరుడేం మాట్లాడలేదు.

రాత్రి విద్యాధరుడి భార్య అనసూయ మగవాళ్ళు ముగ్గురికీ పీటలు వేసి, విస్తళ్ళు పరిచి భోజనం వడ్డించి పిలిచింది. అందరూ వచ్చి కూర్చుని భోజనాలకుపక్రమించారు. ఆ సమయంలో చంద్రుడు మంచి నీళ్ళ లోటానుపట్టుకుని, అటూఇటూ తిరగసాగాడు.

అది చూసి శ్రీనాధుడు కంగారుగా, "వాడు నీళ్ళొలకబోస్తాడో ఏమిటో – ఆలోటా తీసుకో," అని అనసూయను హెచ్చరించాడు.

అనసూయ లోటా తీసుకోబోతుంటే, విద్యాధరుడు వారిస్తూ, "వద్దు ఏడుస్తాడు. వాడేడిస్తే నేను భరించలేను. అయినా వాడు లోటాను జాగ్రత్తగానే పట్టుకున్నాడుగా," అన్నాడు.

అంతలో చంద్రుడు లోటాడు నీళ్ళనూ తండ్రి విస్తట్లో వంపేశాడు. విద్యాధరుడు చప్పున లేవబోయేసరికి శ్రీనాధుడు, "వద్దు, నాయనా! చిన్నపిల్లవాడు, వాడికేం తెలుస్తుంది! వాణ్ణి కొట్టకు," అన్నాడు. విద్యాధరుడు ఆశ్చర్యంగా, "ఇంతచిన్న విషయానికి వాడిని కొడతానని ఎలా అనుకున్నారు? విస్తట్లో నీళ్ళొంపుకుని వద్దామని లేచాను," అన్నాడు.

శ్రీనాధుడు, గదాధరుడి వంక కోపం నటించి చూస్తూ, "చూశావా! చిన్న పిల్లలు అల్లరిచేస్తే విద్యాధరుడు కొడతాడని, నువ్వు అనవసరంగా నాతో వాదించావు. ఇప్పటికైనా తప్పొప్పుకో," అన్నాడు.

అది విని విద్యాధరుడు తెల్లబోయాడు. గురువు, గదాధరుణ్ణి వెంటబెట్టుకుని ఎందు కొచ్చాడో గ్రహించడంతో చిన్నబుచ్చుకుని, "చిన్న విషయానికి గదాధరుడింట పెద్దరగడ చేశానని, ఇప్పుడదర్థ మయింది. గురువర్యా! నా తప్పునెలా దిద్దుకోవాలి?" అన్నాడు.

శిష్యుడడిగిన దానికి శ్రీనాధుడు తృప్తిగా తలాడించి, "ఎదుటివాళ్ళ బిడ్డల్లో నీ బిడ్డను చూడు. నీ బిడ్డను ఎదుటి వారి బిడ్డగా భావించు. అప్పుడు, నీ ఆలోచనా శక్తి కడుపుతీపి బారినుంచి రక్షింప బడుతుంది!" అన్నాడు.

ఆ తర్వాత గదాధర, విద్యాధరుల స్నేహానికి వారి పిల్లలడ్డురాలేదు.



చందమామ

# బంగారు గడియలు

## అంతరిక్ష భీకరమృగం

భారతదేశపు మొట్టమొదటి వ్యోమగామి-సూర్య చంద్రుడిపై దిగాడు.
















# బంగారు గడియలు ప్రశ్నావళి



1. భారతదేశపు మొట్ట మొదటి వ్యోమగామిని - పైనుంచి మన దేశం ఎలా కనిపించింది? అని అడిగినప్పుడు 'సారే జహాఁసే అచ్ఛా!' అని సమాధానం ఇచ్చాడు. ఆ వ్యోమగామి ఎవరు? ఏ సంవత్సరంలో వెళ్ళి వచ్చాడు?





3. కదిలే ఈ బండముక్కను సెరెస్ అంటారు. దీని అడ్డుకొలత దాదాపు 950 కి.మీ. ఈ బండ ఎక్కడ ఉన్నది? దీని ప్రత్యేకత ఏమిటి?

7. ధరించిన దుస్తులను బట్టి, ఈ ప్రజలు మన దేశంలోని ఏయే ప్రాంతాలకు చెందినవారో చెప్పగలరా?

4. శ్రీకృష్ణుడు, అన్న బలభద్రుడు, సోదరి సుభద్ర - కొయ్యవిగ్రహాలను 12వ శతాబ్దానికి చెందిన ఒక దేవాలయంలో పూజిస్తారు. ఆ సుప్రసిద్ధ ఆలయం ఏది?



5. 1996, ఫిబ్రవరి 1వ తేదీ ఒక కప్ప అది నివసిస్తున్న 30 మీటర్ల లోతైన బావినుంచి పైకి రావడం మొదలుపెట్టింది. ప్రతిరోజూ అది 3 మీటర్లు పైకి ఎక్కేది. కాని రాత్రిపూట 2 మీటర్లు వెనక్కు జారిపోయేది. అలా ప్రయత్నం చేస్తూ అది ఏ నెలలో ఏ రోజున బావినుంచి బయట పడిందో చెప్పగలరా?





2. సవాయ్ రాజా జైసింగ్ మన దేశంలోని మొట్టమొదటి నక్షత్రగణితశాల (అబ్జర్వేటరీ) జంతర్-మంతర్‌ను నిర్మించాడు. దాని తరవాత జయ్‌పూర్, మధుర, ఉజ్జయిని, వారణాసిలలో అటువంటి భవనాలు నిర్మించడం జరిగింది. క్రీ.శ 1728వ సం॥లో ఆయన ప్రపంచంలో కెల్లా అతి పెద్దదని చెప్పుకునే సన్‌డయెల్ (సూర్య గడియారం) నిర్మించాడు. దాని పేరేమిటో తెలుసా?

Ǝ4+4I=I

6. రెండు అగ్గిపుల్లలను మార్చి అమర్చడం ద్వారా ఈ సమీకరణ (ఈక్వేషన్)ను సరిదిద్దవచ్చు. ప్రయత్నించండి, మరి!









## 3-డి మాస్క్ తయారుచేసుకోండి!







1. ఒక రబ్బరు బెలూన్ తీసుకుని దాని పరిమాణం మీ తలకన్నా కొన్త పెద్ద దిగా వచ్చేంతవరకు ఊదండి. ఆ తర వాత గాలిపోకుండా బెలూన్ కొసను నూలుదారంముక్కతో కట్టేయండి.

2. ఒక కాగితం తీసు కుని దానిని 3 సెం.మీ. × 2 సెం.మీ కొల తతో చిన్న చిన్న ముక్కలుగా కత్తి రించు కోండి.

3. అడుగున కొంతచోటు వదిలిపెట్టి మిగతా బెలూన్ మీద ఈ ముక్కలను ఒక్కొక్కటిగా అతికించండి. అది ఆరిన తరవాత, ఆ ముక్కలమీద మరొక పొర ముక్కలు అతికించండి. ఆ పొర కూడా బాగా ఆరిన తరవాత, మళ్ళీ ఒకసారి ఒక్కొక్క కాగితం ముక్కగా దానిమీద మూడవ పొర అతికించండి.

4. కాగితపు పొరలు బాగా ఎండిన తరవాత, బెలూన్‌లోని గాలిని వదిలివేయండి. ఆ తరవాత బెలూన్‌ను కాగితం పొరనుంచి నెమ్మదిగా వెలు పలికి లాగేయండి. ఇప్పుడు మీకు ఖాళీగా ఉన్న డొప్ప లభిస్తుంది. ఆ డొప్పకు అడు గున మీ తల దూరడానికి చాలినంత చోటు ఉండేలా కత్తిరించుకోండి.

5. ఆ తరవాత కళ్ళకూ, ముక్కుకూ కావలసిన కంతలు చేసుకోండి. ఇప్పుడు పెయింట్, మేకప్ సామానులు ఉపయోగించి మాస్క్‌కు మీకు కావలసిన రూపం ఇవ్వవచ్చు. ఇక్కడ మీకోసం కొన్ని నమూనాలు ఉన్నాయి.









## మూడు సులభమైన అంచెలలో ఏనుగుబొమ్మ గీయండి.









దుర్యోధనుడు పాండువులపై గల ఈర్ష్యతో మనోవ్యాధిపడి కృశించసాగాడు. అతని స్థితి చూసి శకుని, "దుర్యోధనా, ఏమిటిలా చిక్కిపోయావు? నీకు పట్టుకున్న విచారమేమిటి?" అని అడిగాడు.

దానికి దుర్యోధనుడు, "మామా, ఏం చెప్పమన్నావు? అర్జునుడి పరాక్రమం ఆధారంగా చేసుకుని ధర్మరాజు భూమండలమంతా గెలిచి, రాజసూయ యాగం చేసి సామ్రాజ్యలక్ష్మిని వరించాడు. రాజులందరూ అతనికి వశులైనారు. కృష్ణుడు శిశుపాలుణ్ణి నిండుసభలో వధిస్తే ఒక్కరు కూడా కిక్కురుమనలేదు. రాజులందరూ రత్నరాసులు తెచ్చి పాండవుల కాళ్ళ ముందు పోశారు. వారి వైభవం వర్ణనాతీతం. వాళ్ళ ఐశ్వర్యం చూసి నేను పనికిమాలిన వాణ్ణి అయిపోయాను. మనం మయసభ చూసేటప్పుడు నన్ను చూసి వాళ్ళు ఎలా హేళన చేశారో నువ్వు చూశావు గదా! నాకు జీవితం దుర్భరంగా ఉన్నది. నా బాధ మా తండ్రితో చెప్పు," అన్నాడు.

ఈ మాటలు విని శకుని దుర్యోధనుడితో, "నువ్వు పాండవుల సంపద చూసి అసూయ పడటం దేనికి? వాళ్ళా సంపదను సక్రమంగానే సాధించుకున్నారు. వారికి దైవబలం జాస్తిగా ఉన్నది. అందుకే, వాళ్ళను నువ్వు నిర్మూలించటానికి చేసిన ప్రయత్నం ఒక్కటీ ఫలించలేదు. ద్రౌపది వారికి భార్యకావటం వాళ్ళకొక గొప్ప అదృష్టం; ద్రుపదుడు వాళ్ళకు పెద్ద అండ అయ్యాడు. కృష్ణుడి సంగతి చెప్పనే అవసరం



లేదు; అతను చిన్నతనం నుంచీ వారిని కంటిని రెప్పలాగా కాపాడుతున్నాడు. ఖాండవ దహనం ధర్మమా అంటూ అర్జునుడు అగ్ని దేవుడి సహాయంతో గాండీవమూ, అక్షయ తూణీరాలూ, దివ్యాస్త్రాలూ సాధించుకున్నాడు. వాటితోనే రాజు లందరినీ జయించాడు. ఖాండవదహనం మూలానే వారికి మయసభ కూడా లభించింది. ఇందులో అధర్మ మేమున్నది? అయినా, అంత మాత్రాన నీ కెవరూ లేనట్టు మాట్లాడతావెందుకు? ఆ మాటకు వస్తే నీ కున్న అంగబలం వారి కెక్కడిది? నీకు తొంభై తొమ్మిదిమంది తమ్ములూ, మహా విలుకాడు ద్రోణుడూ, సమస్త అస్త్రాలనూ తెలిసిన అశ్వత్థామా, కర్ణుడూ, కృపాచార్యుడూ, నేనూ, అందరమూ లేమా?" అన్నాడు.

"అలా అయితే మనం సైన్యాలను తీసుకుని పోయి పాండవులతో యుద్ధంచేసి ఆ మయసభను అలాగే హస్తినాపురానికి తెచ్చుకుందాం," అన్నాడు దుర్యోధనుడు.

"దుర్యోధనా, పాండవులను గెలవటం అంత తేలిక కాదు. యుద్ధం దేనికి? అంత కన్న వారిని జయించే సులభోపాయం చెబుతాను విను. ధర్మరాజుకు జూదం చాలా ఇష్టం. అతన్ని జూదానికి పిలు. నేను అతన్ని జూదంలో ఓడించి, అతని రాజ్యాన్నీ, సంపదనూ కాజేసి నీ కిస్తాను. ధృతరాష్ట్రుడి అనుమతి మాత్రం సంపాదించు," అన్నాడు శకుని.

శకుని దుర్యోధనుణ్ణి వెంటబెట్టుకుని ధృతరాష్ట్రుడి దగ్గరికి వెళ్ళేసరికి ధృతరాష్ట్రుడు ధర్మరాజు పూర్తి చేసిన రాజసూయం గురించి ఎంతో సంబర పడుతున్నాడు. శకుని ఆయనతో, "మన దుర్యోధనుడు చిక్కి సగ మయ్యాడు. అతని ముఖం కళాహీనమయి పోయింది," అన్నాడు.

ఈ మాటకు ధృతరాష్ట్రుడు అదిరిపడి, దుర్యోధనుణ్ణి దగ్గరికి తీసుకుని, శరీరంనిమిరి, "ఇలా చిక్కిపోవటానికి నీ కేమి కష్టం వచ్చింది నాయనా?" అని అడిగాడు.

దానికి దుర్యోధనుడు, "నాకు మనో వ్యాధి పట్టుకున్నది. నిద్ర రాదు. భోజనం



రుచించదు. ఎందువల్లా సంతోషం కలగదు. శత్రువుల వైభవం చూసి నాకీ మనోవ్యాధి పట్టుకున్నది. ధర్మరాజుకు గల సంపద పూర్వం ఏ రాజుకూ ఏనాడూ లేదు. నేను చిక్కిపోక ఏం చేస్తాను?" అన్నాడు.

తరవాత శకుని దుర్యోధనుడితో, "రాజా, ధర్మరాజుకు జూదమంటే తగని వ్యసనం, కాని ఆటలో నేర్పు లేదు. నేను జూదంలో ఆరితేరినవాణ్ణి. నా యుక్తితో ధర్మరాజు సంపద అంతా నీకు దక్కేటట్టు చెయ్యగలను. యుద్ధానికి గాని, జూదానికి గాని సాటిరాజు ఆహ్వానించినప్పుడు నిరాకరించటం క్షత్రియ ధర్మం కాదు. అందుచేత మనం పిలిస్తే ధర్మరాజు జూద మాడటానికి వస్తాడు," అన్నాడు.

అప్పుడు దుర్యోధనుడు తండ్రి కాళ్ళ మీద పడి, శకుని చెప్పినట్టు చెయ్యటానికి అనుమతి వేడుతూ, కన్నీరు కార్చాడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో, "విదురుడి సలహా తీసుకుని అతను ఏంచెయ్యమంటాడో చూద్దాం," అన్నాడు.

"విదురుడితో చెబితే ఈ ఆలోచనకు ఎంత మాత్రమూ ఒప్పుకోడు. దీనికి నువ్వు ఒప్పుకోకపోతే నేను బతకను. ఆ తర్వాత నువ్వూ, విదురుడూ ఈ రాజ్యాన్ని నెత్తిన కట్టుకుని ఊరేగండి," అన్నాడు దుర్యోధనుడు, తండ్రి పట్ల చనువుతోనూ, అతి నిరాశతోనూ. ధృతరాష్ట్రుడికి పుత్రమోహం జాస్తి కావటంచేత దుర్యోధనుడి ఆలోచనకు ఎదురు చెప్పలేక పోయాడు. ఆయన శిల్పాచార్యులను అనేకమందిని పిలిపించి మయసభ లాటి సభను నిర్మించమనీ, దానికి వెయ్యి స్తంభాలూ, నూరు వాకిళ్ళూ, రకరకాల బొమ్మలతో కూడిన మంటపమూ ఏర్పాటు చేయమనీ చెప్పాడు. తరవాత ఆయన విదురుణ్ణి పిలిపించి, ఆయనతో తన దురుద్దేశం చెప్పక, ధర్మరాజును జూదానికి రమ్మనమని ఆహ్వానించటం గురించి మాత్రం చెప్పాడు. విదురుడు ధృతరాష్ట్రుడితో, "రాజా, ఈ ఆలోచన నాకు సమ్మతం కాదు. జూదం కారణంగా పిల్లల మధ్య వైరం ఏర్పడుతుంది. ఈ ఆలోచన మాను," అన్నాడు.



దుర్యోధనుడు వినిపించుకోలేదు. జూదం కూడా ఒక విధమైన యుద్ధమేననీ, అందులో నేర్పును బట్టి జయాపజయాలుంటాయనీ శకుని అన్నాడు.

ఈ లోపల ధృతరాష్ట్రుడు కోరిన ప్రకారం హస్తినాపురంలో కూడా ఒక గొప్ప సభా భవనం తయారయింది. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, కొత్త సభలో స్నేహపూర్వకంగా జూదం ఆడటానికి ధర్మరాజును పిలుచుకుని రమ్మని ఆజ్ఞాపించాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "విదురా, ఇందులో మంచిచెడ్డ లేమైనా ఉన్నప్పటికీ స్నేహపూర్వకంగా జూదం జరిగి తీరాలి. కుమారుల మధ్య వైరం వస్తే వారించడానికి నేనూ, నువ్వూ, భీష్ముడూ, ద్రోణుడూ లేమా? నువ్వు రథం మీద ఇంద్రప్రస్థానికి వెళ్ళి ధర్మ రాజును ఇక్కడికి తీసుకురా," అన్నాడు.

విదురుడు ఈ సంగతి భీష్ముడితో చెప్పి ఆయన అభిప్రాయం తెలుసుకునేటందుకు బయలుదేరాడు. అతడు వెళ్ళగానే ధృతరాష్ట్రుడు తన కొడుకును పిలిచి, ఈ జూద ప్రయత్నం మానుకోమని చెప్పి చూశాడు. కావలిస్తే నువ్వు కూడా రాజసూయం చేసి సామ్రాజ్యం సంపాదించు అన్నాడు. కాని

తనకిక తప్పదని గ్రహించి విదురుడు రథం మీద ఇంద్రప్రస్థానికి వెళ్ళాడు. ధర్మరాజు ఆయనకు తగిన సత్కారాలు చేసి, "విదురా, క్షేమంగా ఉన్నావా? నీ ముఖం వాడిపోయి ఉన్నదేం? ధృతరాష్ట్రుడూ, దుర్యోధనాదులూ సుఖంగా ఉన్నారా?" అని కుశల ప్రశ్నలు వేశాడు. దానికి విదురుడు, "అందరూ క్షేమంగానే ఉన్నారు. నీ మయసభలాంటిది హస్తినాపురంలో కూడా కట్టారు. నువ్వు నా వెంట వచ్చి, ఆ సభలో కొన్నాళ్ళు దుర్యోధనాదులతో కులాసాగా గడిపి, వాళ్లతో స్నేహపూర్వకంగా జూద మాడాలట. ఈమాట ముసలిరాజు నీతో చెప్పమన్నాడు. నీతో జూదమాడితేగాని ఆయనకూ, ఆయన కొడుకులకూ సుఖం ఉండదట, ఆ దుర్మార్గుల కోరిక తీర్చు," అన్నాడు.

ఆ మాట విని ధర్మరాజు, "అయ్యయ్యో, పెద్దలు జూదమాడతారా? దానివల్ల తప్పక

తగాదా వస్తుంది. నీ ఉద్దేశం ఏమిటి?నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను," అన్నాడు.

"జూదం కలహకారణమని నేను ఎంత చెప్పినా ఆ గుడ్డిరాజు వినిపించుకోక, నిన్ను తీసుకురమ్మని నన్ను పంపాడు. నువ్వే ఆలోచించి యుక్తమని తోచినట్టు చెయ్యి," అన్నాడు విదురుడు ధర్మరాజుతో.

"అక్కడ జూదమాడటానికి ఉబలాట పడుతున్నవారెవరు?" అని ధర్మరాజు అడిగాడు. "శకునీ, వివింశతీ, చిత్రసేనుడూ,సత్యవ్రతుడూ, పురుమిత్రుడూ, జయుడూ," అని విదురుడు చెప్పాడు.

"జూదరులంతా ఒక చోట చేరారన్నమాట. కాని ఆపద కలిగి తీరుతుంది. పెద్దలు పిలిస్తే వెళ్ళకపోరాదు. జూదానికి పిలిస్తే పోకుండా ఉండరాదని నా నియమం.చాలా భయంగా ఉన్నది. ఏమయితే అవుతుంది, రేపు బయలుదేరుతాను," అన్నాడు ధర్మరాజు.

ప్రయాణ సన్నాహం జరిగింది. ధర్మరాజు తన తమ్ములనూ, ద్రౌపదినీ వెంటబెట్టుకుని హస్తినాపురానికి వచ్చాడు. పెద్దలయిన ధృతరాష్ట్ర, భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామలకు నమస్కారాలు చేశాడు. చిన్నవారిని పలకరించి, గాంధారితో కుశల ప్రశ్నలు జరిపాడు. ద్రౌపది ముఖాన మహారాణి కళ గమనించి, దుర్యోధనుడు మొదలయిన వాళ్ళ భార్యలు అసూయ పడ్డారు.

ఆ రోజు గడిచి మర్నాడు తెల్లవారగానే ధర్మరాజు కాలకృత్యాలు తీర్చుకుని, శకునీ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలైన





వాళ్లున్న జూదమాడే ఇంటికి వచ్చి, పెద్దలం దరికీ నమస్కారాలు చేశాడు.

అప్పుడు శకుని ధర్మరాజుతో, "రాజా, నిన్ను చూడటానికి కొందరు ఈ సభకు వచ్చారు. మరికొందరు కాలక్షేపం కోసం నీతో జూదమాడ వచ్చారు. అందుచేత నియమాలు ఏర్పాటు చేసుకుని, ఈ పాచికలతో జూదం ప్రారంభిద్దాం," అన్నాడు.

దానికి ధర్మరాజు, "శకునీ, జూదంలో మోసం చెయ్యటం చాలా పాపం. అందులో క్షత్రియుడి ఘనత ఏమీ బయట పడదు. అందుచేత మోసంతో మమ్మల్ని జూదంలో గెలవటానికి ప్రయత్నించకు. మేము సంపాదించుకున్న ధనం బ్రాహ్మణ సంరక్షణార్థమూ, దుష్ట శిక్షణార్థమూ వినియోగిస్తున్నాం," అన్నాడు.

"వేదాధ్యయనంలో సమర్థుడైన శ్రోత్రియుడు మరొక శ్రోత్రియుణ్ణి వేదాధ్యయనంలోనే గెలుస్తాడు. అలాగే మోసంచేసే జూదరిని మోసంతోనే గెలవాలి. ఇది సహజం. జూదమాడటం. నీకిష్టంలేని పక్షంలో మానెయ్యి," అన్నాడు శకుని.

ధర్మరాజు పౌరుషం వచ్చి, "జూదానికి పిలవబడి వచ్చి వెనక్కు పోవటం అగౌరవం. అందుచేత ఆడతాను. నా కెదురాడే వారెవరు?" అని అడిగాడు.

"నా పక్షాన మా మేనమామ శకుని ఆడతాడు. అతను ఏ పందెం కాసినా నేను ఇస్తాను," అన్నాడు దుర్యోధనుడు.

"ఒకరి పక్షాన మరొకరు ఆడగా నేనెన్నడూ చూడలేదు, వినలేదు. ఇది అపూర్వంగా ఉన్నది. అయినా మీ ఇష్టప్రకారమే కానివ్వండి," అన్నాడు ధర్మరాజు.

జూదం చూడటానికి ధృతరాష్ట్రుడు తన వెంట రమ్మని పిలవగా కౌరవ వృద్ధులూ, భీష్మ ద్రోణ కృప విదురులూ వచ్చి, సభను అలంకరించారు.

మొదటి పందెంగా ధర్మరాజు తన హారానికి గల మణిపూస ఒడ్డితే, దుర్యోధనుడు తన వద్ద ఉన్న మణిరాసులన్నీ ఒడ్డాడు. పందెం వెయ్యగా ధర్మరాజు ఒడ్డిన మణి పోయింది. అది మొదలు ధర్మరాజు పందెం ఒడ్డిన

ప్రతిదీ శకుని గెలిచాడు. జూదంలో ఓడి పోతున్నకొద్దీ ధర్మరాజుకు మత్సరం జాస్తి అయింది. అతను బంగారాన్నీ, గుర్రాలనూ, ఏనుగులనూ, రథాలనూ, దాసీజనాన్నీ, అనేక నిధులనూ పణంగా పెట్టి అన్నిటినీ పోగొట్టుకున్నాడు.

ఇలా సాగుతున్న అన్యాయాన్ని సహించలేక విదురుడు ధృతరాష్ట్రుడితో, "చావనున్నవాడికి దివ్యౌషధాలు రుచించవన్నట్టు, మా మాటలు నీకు రుచించవు. నీ కొడుకు కులం చెరచటానికి పుట్టాడు. నువ్వే ఈ మోసపు జూదాన్ని ఏర్పాటు చేసి పాండవుల ధనం అపహరిస్తున్నావు. దీనివల్ల నీకు చాలా హాని కలుగుతుంది. నా మాటవిని వారికి ఆగ్రహం కలగనియ్యకు. పాండవుల సొత్తు కాజేసి ఆనందించటం కాదు, రేపు వారి ఆగ్రహానికి గురికావాలి. మీరు నిశ్చయంగా నిర్మూలమవుతారు. అందుచేత ఈ జూదం ఆపించు," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ఈ మాటలు వినిపించుకోలేదు. కాని దుర్యోధనుడు మాత్రం మితిమించిన అహంకారంతో విదురుణ్ణి నానా మాటలూ అన్నాడు. ఈ లోపల ధర్మరాజు తన కున్నదంతా ఓడాడు; బ్రాహ్మణ మాన్యాలు తప్ప తనకున్న రాజ్యాన్నీ, బ్రాహ్మణులు కాక తన మిగతా ప్రజలనూ ఓడాడు. శకుని పాచికలను ధర్మరాజు ముందు వేసి, "పణంగా పెట్టటానికి నీ కింకేమీ లేదు!" అన్నాడు.

ధర్మరాజు సహదేవుణ్ణీ, నకులుణ్ణీ పణం పెట్టి, ఇద్దరినీ పోగొట్టుకున్నాడు. తరవాత అర్జునుణ్ణీ, భీముణ్ణీ కూడా ఓడి, తనను తానే పణంగా పెట్టుకుని ఆ పందెం కూడా ఓడాడు.

"నీ సొత్తు ద్రౌపది ఉన్నది గదా? ఆమెను పందెంగా పెట్టు," అన్నాడు శకుని. ధర్మరాజు ఆ పని కూడా చేశాడు.

దీనితో సభలో కలకలం పుట్టింది. కౌరవులకిదేం పొయ్యేకాలం అన్నారు కొందరు. భీష్మద్రోణకృపులు మాత్రం ఏమీ మాట్లాడలేదు. విదురుడు బుసలు కొట్టుతూ ఉండిపోయాడు. కర్ణదుశ్శాసనుల ఆనందం అంతా ఇంతా కాదు.



చందమామ
అనుబంధం - 91

మనదేశపు చెట్లు :

# మహావేప

కాంతివంతమైన పచ్చరంగుతో ఇంచు మించు ఒక అడుగు పొడవూ, బాగా వెడల్పూ కలిగిన ఆకులతో పెద్దవేపాకుల్లా కనిపించే ఆకులునిండిన మహావేపచెట్టు, మామూలు వేపజాతికి చెందినది కాదు. ఈ పెద్ద ఆకులు చిన్నచిన్న ఆకులుగా చీలి, అండాకారంలో అంచులలో గరుకుగా మొనదేలి ఉంటాయి.

హిందీలో బొకైన్ అనీ, బెంగాలీలో మహా నీమ్ అనీ, తమిళంలో మలవేంబు అనీ, మలయాళంలో కరీన్‌వేంబు అనీ, మరాఠీలో పెజ్రీ అనీ,గుజరాతీలో బాకాన్ లిమ్డో అనీ, ఇంగ్లీషులో బీడ్‌ట్రీ, పర్షియన్ లిలాక్ అనీ పిలువబడే మహావేపను తెలుగులో తురక వేప, కొండవేప అని కూడా అంటారు. ఇది పర్షియానుంచి, బెలూచిస్థాన్‌నుంచి ఇతర ప్రదేశాలకు విస్తరించిందని అంటారు.

వీటి పూలు ఊదారంగు గొట్టాలతో, లేత నీలంరంగు దళాలతో చూడడానికి చాలాఅందంగా ఉంటాయి. వాటినుంచి వీచే తేనెవాసన అందరినీ ఆకర్షిస్తుంది. వసంత రుతువు ప్రారంభంలో అంటే మార్చ్, ఏప్రిల్ నెలలమధ్య బోసిగాఉన్నకొమ్మలలో పువ్వులు పుట్టుకొస్తాయి. ఆ తరవాత క్రమంగా ఆకులు చిగురిస్తాయి. కొన్ని రోజులలో చెట్టంతా ఆకులతో,పువ్వులతోనిండిపోతుంది.రెండుమూడు నెలల తరవాత పూలు రాలిపోతాయి.

వీటి కాయలు గుండ్రంగా ఉంటాయి. లోపల గుజ్జు,నాలుగుగింజలతోపైనగట్టిపెంకుఉంటుంది ఈ పళ్ళను పక్షులు ఇష్టపడి తింటాయి. కాని, మనుషులకు మాత్రం ఇవి విషప్రాయమని చెపుతారు. గింజలకు ఔషధగుణాలు ఉన్నాయి. ముఖ్యంగా కీళ్ళనొప్పులకు బాగా పనిచేస్తుందని చెపుతారు. ఈ గింజలను దండలలో పూసలుగా కూడా వాడతారు.

ఈ చెట్లు మామూలుగా 12-25 మీటర్ల ఎత్తు పెరుగుతాయి.చెట్లుగుబురుగా గొడుగుల్లా ఉంటాయి. అందువల్ల వీటిని నీడకోసం పెంచుతారు. ఈ చెట్లు చాలా వేగంగా పెరుగుతాయి.



మన దేశపు ఋషులు:

# మహీదాసు-కవశుడు

విశాలుడనే ఋషి వద్ద పలువురు శిష్యులు విద్య నభ్యసించేవారు. వారిలో ఆయన కుమారుడు కూడా ఒకడు. ఒకనాడు విశాలుడు శిష్యులకు యజ్ఞవిధిని వివరిస్తున్నాడని తెలిసి, ఆయన కుమారుడు కూడా ఉత్సాహంతో, అక్కడికి చేరాడు. కానీ విశాలుడు అతనికి వేరొక పనిని పురమాయించి, అతన్ని అక్కడినుంచి పంపేశాడు.

తండ్రి ధోరణికి ఆశ్చర్యం చెందిన కుర్రవాడు, తల్లి అయిన ఇతర దగ్గరికి వెళ్ళి, తండ్రి తనకెందుకో యజ్ఞ విధిని వివరించడానికి ఇష్టపడడం లేదని చెప్పాడు.

తల్లి కొంతసేపు ఆలోచించి, "నాయనా! మీ తండ్రి బ్రాహ్మణుడే గాని, నేను మాత్రం వ్యవసాయ కుటుంబానికి చెందిన దానను. మీ తండ్రి బ్రాహ్మణులకు మాత్రమే యజ్ఞ విధిని నేర్పుతాడు. అయినా ఇప్పుడు మించి పోయిందేమీ లేదు. నువ్వు ఈ నాటినుంచి మానవ జీవితానికి ఆధారభూతమైన భూమాతను పూజించు. సర్వ సంపదలకూ, విద్యలకూ భూమాతే మూలం. ఆమె అనురాగమూర్తి. ఆమెను పూజించిన వారికి సకల సంపదలూ, హృదయంలో జ్ఞానమూ సిద్ధిస్తాయి," అని సలహా ఇచ్చింది.

ఆ తరవాత అతడు పన్నెండేళ్ళు భూదేవిని భక్తి శ్రద్ధలతో పూజిస్తూ, ప్రకృతిని నిశితంగా పరిశీలిస్తూ, వ్యవసాయం కొనసాగించాడు. ఆయన పెరిగి పెద్దవాడై మహీదాసు అనే ఋషిగా పేరుగాంచాడు. తల్లి పేరు కారణంగా ఆయనకు ఐతరేయుడనే మరొక నామం కూడా ఏర్పడింది. ఆయన ఐతరేయ బ్రాహ్మణ, ఐతరేయ ఆరణ్యక, ఐతరేయ ఉపనిషత్ అనే మూడు గ్రంథాలు రచించాడు.

ఆయన నూటపదహారు సంవత్సరాలు జీవించాడు. ఆయన తల్లి బ్రాహ్మణేతర స్త్రీ అన్న విషయం పట్టించుకోకుండా అందరూ ఆయన్ను గౌరవించారు.

ఆయన రచించిన ఐతరేయ బ్రాహ్మణాలలో కవశుడనే మరొక ఋషి ప్రస్తావన ఉన్నది. కవశుడి తల్లి కూడా బ్రాహ్మణ స్త్రీ కాదు. సరస్వతీ నదీ తీరంలో మునులు కొందరు యజ్ఞం చేస్తూండగా కవశుడు అక్కడికి వెళ్ళాడు. కాని మునులు, "మేము నిన్ను ఆహ్వానించలేదు కదా? మరెందుకు వచ్చావు?" అని ఆక్షేపించారు.

కవశుడు అక్కడి నుంచి బయలుదేరబోతూండగా, సరస్వతీనదీపాయ ఒకటి ఆయన్ను సమీ పించి ఆయన పాదాలను జలంతో అభిషేకిం చింది. దానిని చూసి మునులు దిగ్భ్రాంతి చెందారు. కవశుడి గొప్పదనం గుర్తించి క్షమాపణలు చెప్పుకుని ఆయనను గౌరవించ సాగారు.



# మీకు తెలుసా?

1. ఒక దేశ ప్రజలు ఒక అగ్ని పర్వతాన్ని పవిత్రంగా భావిస్తారు. ఆ అగ్ని పర్వతం పేరేమిటి? ఏ దేశంలో ఉన్నది?
2. వింబుల్డన్ టెన్నిస్ పోటీలలో పాల్గొన్న మొట్టమొదటి భారతీయుడు ఎవరు?
3. మనదేశంలో మానవనిర్మితమైన అతిపెద్ద తటాకం ఏది?
4. ఆభరణాలు చేయడానికి బంగారంలో కలిపే లోహం ఏది?
5. కొలంబస్ అమెరికాను ఎప్పుడు కనుగొన్నాడు?
6. 'బెంగాల్ విషాద నది' గా దేనిని చెబుతారు?
7. అంతర్జాతీయ న్యాయస్థానంలో ఎందరు న్యాయమూర్తులు ఉన్నారు?
8. మనదేశానికి చెందిన రాకేష్‌శర్మ మరిద్దరు సోవియట్ వ్యోమగాములతో తన ప్రయాణాన్ని ఎప్పుడు ప్రారంభించాడు?
9. ఫాహియాన్ మనదేశాన్ని ఎప్పుడు సందర్శించాడు?
10. ప్రప్రథమంగా ఆసియా క్రీడలు ఎప్పుడు జరిగాయి? ఎక్కడ జరిగాయి? ఛాంపియన్లు ఎవరు?
11. మానవ శరీరంలో ఎముకల ఉపయోగం ఏమిటి?
12. తాజ్‌మహలును ఎవరు నిర్మించారు? దాని నిర్మాణానికి ఎంతకాలం పట్టింది?
13. మంగోలియా రాజధాని ఏది?
14. వల్లభాయ్ పటేల్‌ను 'సర్దార్' అని ఎందుకు అంటారు?
15. ప్రపంచంలో కెల్లా భారీ ఎత్తున 'ధాన్యవ్యాపారం' ఎక్కడ జరుగుతుంది?
16. మనదేశంలో కెల్లా ఎత్తయిన జలపాతం ఏది?

## సమాధానాలు

1. మౌంట్ ఫ్యూజియామా; జపానులో.
2. సర్దార్ నిహల్ సింగ్, 1908లో.
3. నర్మదా సాగర్.
4. రాగి.
5. 1492 లో.
6. దామోదర్.
7. పదిహేను.
8. 1984 ఏప్రిల్ 5.
9. క్రీ.శ. 405 - 411 మధ్య.
10. 1951 - న్యూఢిల్లీ, ఇండియా, జపాను.
11. శరీరానికి ఆకారాన్నిస్తాయి. గుండె,మెదడు, ఊపిరితిత్తులు వంటి అవయవాలను రక్షిస్తాయి.
12. మొగలుచక్రవర్తి షాజహాన్, 22సం॥లు.
13. ఉలాన్ బేటార్.
14. గుజరాత్‌లోనిబర్డోలీలో పన్నుల నిరాకరణోద్యమానికి నాయకత్వం వహించి నడపడం వల్ల.
15. అమెరికాలోని చికాగోలో.
16. కర్నాటకలోని జోగ్ జలపాతం.




# కలిసొచ్చిన అదృష్టం

గౌరీపురంలోని రామయ్య, ఒకప్పుడు బాగా కలిగినవాడు. అయితే, బంధుప్రీతీ, అమాయకత్వమూ రెండూ కాస్త ఎక్కువ గల రామయ్య, అయినవాళ్ళకూ కానివాళ్ళకూ కూడా అడిగిందల్లా లేదనకుండా ఇవ్వడం సాగించి, ప్రస్తుతం అతిపేదగా జీవిస్తున్నాడు. అతడి భార్య చాలాకాలం క్రితమే మరణించింది. ప్రస్తుతం అతడికున్న దిక్కల్లా, అతడి ఏకైక సంతానం శకుంతల.

శకుంతల చూడచక్కని పిల్ల. మంచీ మర్యాదలు తెలిసిన వివేకవతి. ఉన్న ఒక్కగా నొక్కకూతుర్నీ సుఖపెట్టలేకపోతున్నానే అని, గడిచిన రోజులు తలుచుకుని రామయ్య బాధపడుతూ ఉండేవాడు.

ఇలా ఉండగా, రామయ్య మనసులో కూతురి పట్ల ఉన్న చింత తెలిసిన రామయ్య ఆప్తమిత్రుడు భూపతి, శకుంతలకు ఒక సంబంధం తీసుకు వచ్చాడు. కుర్రవాడు గౌరీపురానికి కాస్త దూరంలో ఉన్న కృష్ణ పట్నంలోని కచేరీలో ఉద్యోగం చేస్తున్నాడు. అందమైన పిల్లను పెళ్ళాడాలని అతడి కోరిక. వాళ్ళకు కాస్త దూరపు బంధువైన భూపతి శకుంతల గురించి వాళ్ళకు చెప్పాడు. సత్యం, శకుంతలను చూడటానికి ఆసక్తి చూపించాడు.

భూపతి రామయ్య ఇంటికి వచ్చి, అతడికి అంతా వివరంగా చెప్పి, "పెండ్లికొడుకు తండ్రి కొంచెం ఆశపోతు. కాని, కుర్రవాడు శకుంతలను చూసి ఇష్టపడితే, అప్పుడు ఏవో మన పాట్లు మనం పడి, సాధ్యమైనంత తక్కువ కట్నానికి అతణ్ణి ఒప్పించే ప్రయత్నంచేద్దాం," అన్నాడు.

ఆ మాటలకు రామయ్య దిగులుగా, "అధమపక్షం, కట్నం కింద ఐదారు వేలైనా ఇవ్వకపోతే తప్పదు కదా! అది ఇప్పుడు నావల్ల సాధ్యంకాదు. పైగా పెళ్ళి ఖర్చులకు

"లలిత-శర్మిల"

డబ్బు కావాలి. ఇదంతా ఎక్కడి నుంచి తేగలం," అన్నాడు.

ఇందుకు భూపతి ఒక్కక్షణం తటపటాయించి, "అయితే విను! దాదాపు పదిహేను సంవత్సరాల క్రితం, ఎక్కడో వ్యాపారం చేసుకుంటానని, భార్యాబిడ్డలతో ఈ ఊరు వదిలిపోయిన కోదండం గుర్తున్నాడా?" అని అడిగాడు.

రామయ్య ఆశ్చర్యపోతూ, "అదేనాటి మాట! ఇప్పుడాయన ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"వారం క్రితం నేను కృష్ణపట్నం వెళ్ళినప్పుడు, ఒకరోజు ఉదయాన రంగనాథుడి గుడికేసి వెళ్ళాను. ఆ సమయంలో, అక్కడ ఉన్న వాళ్ళందర్నీ దూరంగా పొమ్మని భటులు కేకలు వేశారు. నేను కాస్త దూరంగా నిలబడి చూస్తూండగా నలుగురు రాజోద్యోగులతో కలిసి కోదండం కూడా వచ్చాడు. పదిహేనేళ్ళ క్రితం ఎలా ఉన్నాడో అలాగే ఉన్నాడు. నేను ఆశ్చర్యపోయి, పక్కనున్న వ్యక్తిని, ఆయనెవరని అడిగాను. అందుకతను, 'కోదండపాణిగారని ప్రముఖ వర్తకులు. చాలా ధర్మాత్ములు. గుడివెనక ఉన్న సత్రం వారు కట్టించిందే!' అన్నాడు. అటువంటి ధర్మాత్ముడు నువ్వు ఇచ్చిన డబ్బును చిల్లిగవ్వ కూడా చెల్లించకుండా, అసలు ఇటువైపే తొంగి చూడకుండా ఎందుకున్నట్టు? పెద్దమనిషిగా పేరు తెచ్చుకున్నవారు ఇలా చేస్తారా? నాకు



ఎందుకనో అతణ్ణి కలుసుకోవటం మనస్కరించలేదు," అన్నాడు.

"అలాగా! భగవంతుడి దయవల్ల బాగుపడి పైకొచ్చాడు. అదే చాలు," అన్నాడు రామయ్య తృప్తిగా.

భూపతి జాలిగా, "జీవితంలో తన్నుమాలిన ధర్మానికి ఒడిగట్టి, నువ్వీ స్థితికి వచ్చావు. ఇప్పుడు నువ్వు మడిగట్టుకు కూర్చుంటే అవతల నీ కూతురు బతుకు తెల్లవారుతుంది. ఈ పెళ్ళివారు వెళ్ళాక, మనిద్దరం కలిసి వెళ్ళి కోదండపాణికి సంగతి చెప్పి సాయం అడుగుదాం," అన్నాడు.

రామయ్య అలాగే అన్నట్లు మౌనంగా తల ఊపాడు.



తర్వాత కొద్దిరోజుల్లోనే పెళ్ళి కొడుకు తండ్రి శేషానందం కొడుకు సత్యంతోపాటు బంధువులంటూ నలుగురిని వెంటబెట్టుకుని, అట్టహాసంగా పెళ్ళిచూపులకు వచ్చాడు. పెళ్ళిచూపులు జరిగాయి. శకుంతల పెళ్ళికొడుకుతో సహా వచ్చిన వాళ్ళందరకీ ఎంతగానో నచ్చింది.

శేషానందం, భూపతితో, "భూపతీ, నువ్వు చెప్పిన ఈ పిల్ల మా అందరకీ నచ్చింది. మా వాడికి కచ్చేరిలో ఉద్యోగం అన్న సంగతి నీకు తెలుసు కదా? పాతికవేల కట్నం ఇస్తామంటూ లోగడ రెండు మూడు సంబంధాలు వచ్చాయి. కాని పిల్లలు మాకు నచ్చ లేదు," అన్నాడు.

దానికి భూపతి, "ఆనందం! రామయ్య పరిస్థితి నీకు మొదటే చెప్పాను. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆయన ఐదారువేలకంటే ఇచ్చుకోలేడు," అన్నాడు.

అందుకు శేషానందం చిరాగ్గా, "ఐదారు వేలా? ఎవరైనా వింటే నవ్విపోతారు. పదిహేనువేలకు పదిపైసలు తగ్గినా ఒప్పుకునేది కల్ల!" అన్నాడు.

ఇంతలో ఇంటిముందు గుర్రపుబండి ఒకటి ఆగింది. అందులోంచి ఒక యువకుడు దిగి, రెండుచేతుల్లో రెండు సంచులు పట్టుకుని లోపలికి వచ్చాడు.

అతడు లోపలికి అడుగు పెట్టగానే శేషానందం చప్పున లేచి నిలబడి,ఆ యువకుడికి నమస్కరిస్తూ, ఆశ్చర్యంగా, "అబ్బాయి గారు, ఇలా దయచేశారేమిటి?" అంటూ ప్రశ్నించాడు.

ఆ యువకుడు, ఆ ప్రశ్నకు జవాబుగా నవ్వి వూరుకుని, తనకేసి ఆశ్చర్యంగా చూస్తున్న రామయ్య దగ్గరకు వెళ్ళి, వంగి పాదాభివందనంచేసి, "నన్ను గుర్తుపట్టలేదా మామయ్యా? నీ ఆప్తమిత్రుడు కోదండం పెద్ద కొడుకును, పదిహేను సంవత్సరాల క్రితం నువ్వు బాలగోపాలా అంటూ ముద్దు చేసేవాడివే, ఆగోపాలుణ్ణి," అన్నాడు. నవ్వుతూ.

ఆ మాటలు వింటూనే రామయ్య పట్టరాని ఆనందాశ్చర్యాలతో, "ఎంతవాడవయ్యావు! మిమ్మల్నందర్నీ చూసి ఎన్నాళ్ళయింది! అమ్మా

నాన్నా అంతా బాగున్నారా?" అంటూ కుశల ప్రశ్నలు వేశాడు.

"అంతా బాగున్నారు," అంటూ గోపాలుడు పక్కన నిలబడి ఉన్న శేషానందం వైపు తిరిగి, "ఇంతకూ మీరెందుకిక్కడికి వచ్చినట్టు?" అని అడిగాడు.

శేషానందం శకుంతలను చూపిస్తూ, "ఆమెను మా సత్యానికి చేసుకుందామని వచ్చాను. మీ మామయ్యగారు నేనడిగిన కట్నం ఇవ్వలేనన్నాడు. సరి, శెలవు, వస్తాను!" అంటూ అక్కడి నుంచి, విసురుగా గుమ్మం వైపు రెండడుగులు వేశాడు.

అంతలో గోపాలుడు, శేషానందాన్ని ఆగమని, "ఇంతకుముందు నేనిక్కడికి ఎందుకు వచ్చానని అడిగారు కదా? ఇప్పుడు చెబుతున్నాను. వినండి! మా నాన్నగారి కోరిక ప్రకారం, మా రామయ్యమామ కూతుర్ని,మా ఇంటి కోడలిగా అంటే నా భార్యగా తీసుకుపోవాలని వచ్చాను.అయితే మిమ్మల్ని చూసి, అయ్యో, నేనాలస్యం చేశానే అనుకున్నాను. కాని, ఎలాగైతేనేం మీరు మా నాన్నగారి కోరిక తీర్చడంలో నాకు ఎంతగానో సాయపడ్డారు. అందుకు మీకు కృతజ్ఞతలు!" అన్నాడు.

అతడి మాటల్లో చురుక్కుమంటున్న వ్యంగ్యానికి శేషానందం ఉడికిపోతూ, పరుగులాంటి నడకతో వెంటవచ్చిన వారితో కలిసి వెళ్ళిపోయాడు.



అతడు వెళ్ళగానే గోపాలుడు, శకుంతల, రామయ్యల వైపు చూస్తూ, "మీ అభిప్రాయం ఏమిటో తెలుసుకోకుండా తొందరపడ్డాను. ముందు అంతా వివరంగా చెబుతాను. వినండి," అంటూ ఇలా చెప్పడం ప్రారంభించాడు:

"పదిహేనేళ్ళ క్రితం మా నాన్నగారు, మామయ్య దగ్గర డబ్బు తీసుకునే సరికే మామయ్య పరిస్థితి దిగజారుతున్నదట! నాన్నగారు కృష్ణపట్నంలో వ్యాపారం ప్రారంభించాక, పట్టిందల్లా బంగారమైంది. ఏడాది తిరిగేసరికి, మామయ్య ఇచ్చిన డబ్బుకు అసలుకు వడ్డీ కూడా కలిపి, మామయ్యకు ఇద్దామని బయలుదేరబోయారు. అయితే, ఆ సమ

యంలో ఒక మిత్రుడి ద్వారా భూమయ్యలో మార్పేమీ రాలేదనీ, ఆయన ఇంకా ఉన్నంతలో వారికీ వీరికీ అపాత్రదానం బహుశా అప్పుపేరుతో చేస్తున్నట్లు తెలిసింది. ఆ కారణంగా అప్పట్లో మామయ్యచేతికి డబ్బు ఇచ్చే ఆలోచన విరమించుకుని, ఆ డబ్బును మామయ్యపేరిటవ్యాపారంలో పెట్టుబడిగా పెట్టారు. ఏటేటా వచ్చే లాభాల్లో మామయ్య వంతును విడిగా రాసి ఉంచారు. ఆడబ్బును ఇప్పుడు రెండుసంచుల్లో తెచ్చాను. ఇకపోతే," అంటూ సందేహిస్తూ ఆగిపోయాడు.

"చెప్పవలసిందేదో చెప్పు, సందేహించకు," అన్నాడు రామయ్య.

గోపాలుడు సంకోచంగా శకుంతలవైపు చూసి, "మామయ్యా! నువ్వంటే మా అమ్మా, నాన్నలకు ఎంతో గౌరవం, అభిమానం. నీ కూతుర్ని కోడలిగా చేసుకోవాలన్నదే వారి కోరిక. కాని, నేను పిల్ల నాకు-నచ్చితేనే చేసుకుంటానన్నాను. అందుకే, నాన్నగారు, తను రాకుండానన్నుమాత్రమే పంపారు. నీ కుమార్తె నాకు నచ్చింది. ఇక నిర్ణయంమీదే," అన్నాడు.

అతడి మాటలకు భూపతి, రామయ్య ఆనందపడుతూ శకుంతలవైపు చూశారు. శకుంతల సిగ్గుతో తల వంచుకుంటూ, "మా నాన్నకు ఆప్తమిత్రులూ, మా పట్ల ఎంతో ఆత్మీయంగా ప్రవర్తిస్తున్న వారి కోరిక, నాకు ఆజ్ఞతో సమానం. భగవంతుని పాదాల దగ్గరి పవిత్రపుష్పాన్ని తలదాల్చినంత ఆనందంగా, ఆ ఆజ్ఞను శిరసావహిస్తాను," అన్నది.

శకుంతల ఇలా అనగానే రామయ్య అంతులేని ఆనందంతో గోపాలుణ్ణి కౌగలించుకుని, "బాబూ, మంచి స్నేహితుణ్ణి మించిన ఆత్మీయుడులేడన్న సూక్తిని మీ నాన్న నిజం చేశాడు!" అన్నాడు.

భూపతి సంతోషంగా నవ్వుతూ, "నిజమైన స్నేహితుడంటే మీ నాన్నే. ఇంతకూ అదృష్టం రామయ్యది. ఐశ్వర్యం, ఐశ్వర్యాన్ని మించిన వెలలేని స్నేహం, బంగారమంటి అల్లుడు-అన్నీ ఒక్కసారి కలిసొచ్చాయి. కలిసొచ్చిన అదృష్టమంటే ఇదే!" అంటూ మనసారా మిత్రుణ్ణి అభినందించాడు.





# చెడ్డవాకిలి-మంచివాకిలి

ఒక గ్రామంలో సంగయ్యా, శరభయ్యా అని ఇద్దరు యువకులుండేవారు. వారు చిన్నతనం నుంచీ కూడా ఎంతో ప్రాణస్నేహితులుగా ఉంటూ వచ్చారు. కొంతకాలం గడిచాక శరభయ్య ఆ గ్రామం విడిచి తన పొట్టపోసుకునేటందుకు గాను దూరదేశం వెళ్ళాడు. సంగయ్య మటుకు తనకున్న పొలాలను పండించుకుని, డబ్బు సంపాదించాడు, గొడ్డూగోదా అభివృద్ధి చేసుకున్నాడు, పెళ్ళి చేసుకున్నాడు, మంచి లోగిలి కూడా కట్టుకున్నాడు. అతనిపని బాగున్నది.

గ్రామం విడిచిన ఏడేళ్ళకు శరభయ్య ఏదో పనిమీద ఆ ప్రాంతాలకు వచ్చి, చిన్ననాటి స్నేహితుడయిన సంగయ్యను చూసి, పలకరించి, క్షేమసమాచారాలనుతెలుసుకుపోదామని వచ్చాడు. పూర్వం చిన్న ఇల్లున్న చోట ఇప్పుడు పెద్ద పెంకుటిల్లు ఉన్నది. దానికెదురుగా ఉన్న చింతచెట్టు చాలా పెద్దదయ్యింది. దానికింద ఒక రాతి అరుగు కూడా వేశారు.

"ఫరవాలేదు; సంగయ్య బాగుపడ్డాడు!" అనుకుంటూ శరభయ్య ఇల్లునుసమీపిస్తూ ఉండగా,వసారాలోంచిఒకకుక్కబోయ్‌మని పెద్దగాఅరుస్తూ శరభయ్యకేసి రాసాగింది.

కుక్క అరుపు విని సంగయ్య భార్య తలుపు తెరుచుకుని బయటికి వచ్చి, కుక్కను తరిమేసి శరభయ్యకేసి చురచురా చూసింది.

"సంగయ్యఇల్లు ఇదేనాఅమ్మా?"అనిశరభయ్యఅడిగాడు.అవునన్నట్టుతలఊపింది సంగయ్య భార్య.

"ఇంట్లో ఉన్నాడా? ఎక్కడి కెళ్ళాడో?" అన్నాడు శరభయ్య.

"ఏమో నాకు చెప్పి వెళ్ళలేదు!" అన్నది సంగయ్య భార్య. "నేనూ, సంగయ్యా ఒకప్పుడు విడవని స్నేహితులం.ఏడేళ్ళ కిందట ఈ గ్రామం విడిచి వెళ్ళాను. నా చిన్ననాటి

స్నేహితుణ్ణి చూసి పోదామని వచ్చాను," అన్నాడు శరభయ్య.

సంగయ్య భార్య ఇందుకేమీ అనలేదు. శరభయ్యను లోపలికి రమ్మని ఆహ్వానించ లేదు. ఎండ మండిపోతున్నది. శరభయ్య చింతచెట్టుకింది అరుగుమీద చతికిలబడి, పైబట్ట చెంగుతో ముఖం మీది చెమట తుడుచుకుంటూ, "తెలీకఅడుగుతున్నాను. సంగయ్యకు నువ్వేమవుతావమ్మా? భార్య వేనా?" అని అడిగాడు

ఆమె అవునన్నట్టు తల ఆడించింది.

"బాగుంది, కొత్తగానే పెళ్ళి అయిన ట్టుంది. అబ్బ ఎండ ఎంత తీవ్రంగా ఉంది! తాగడానికి కాస్త మంచినీళ్ళిస్తావా, అమ్మా!" అన్నాడు శరభయ్య. ఆమె లోపలికి వెళ్ళి లోటాలో నీళ్ళు తెచ్చి ఇచ్చింది. నీళ్ళు బిందె లోవి కావడం వల్ల చల్లగా లేవు, నోట్లో పోసుకుంటే కొద్దిగా వాసన వేసింది. శర భయ్య ఆ నీటిని అవతల పారబోసి లోటా ఆమెకిచ్చేసి, "ఇకనేను బయలుదేరాలి. సంగయ్యను కలుసుకోలేక పోయాను. అతను వస్తే నేను వచ్చి వెళ్ళానని చెప్పు. నా పేరు శరభయ్య. సంగయ్య పైకివచ్చి నందుకు చాలా సంతోషించానని చెప్పు. ఈ ఇల్లుకూడా చాలా చక్కగా కట్టాడు. కాని నాకు ఈ వాకిలి ఒక్కటే నచ్చలేదని చెప్పు. ఉన్నమాట దాచకుండా చెప్పేస్తున్నందుకు ఏమీ అనుకోకు. ఈ వాకిలి కొంచెం కూడా బాగా లేదు. నేను వడ్రంగిని. నాకు వాకిళ్ళ సంగతి బాగా తెలుసు. ఈ వాకిలి సంగతి



సంగయ్య గమనించాడో లేదో. అది బాగా లేదని నేనన్నట్టు అతనితో చెప్పు!" అంటూ శరభయ్య లేచి తన దారిన వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చీకటి పడినదాకా సంగయ్య ఇంటికి రాలేదు. తాను లేని సమయంలో శరభయ్య వచ్చి అప్పుడే వెళ్ళిపోయాడని తెలియగానే అతను చాలా నొచ్చుకుంటూ, "అతన్ని ఉంచలేకపోయావా? ఎందుకు వెళ్ళిపోనిచ్చావు?అతనువచ్చి ఏమన్నాడు?" అని భార్యనడిగాడు.

"మనం పైకి వచ్చినందుకు చాలా సంతోషంగా ఉందన్నాడు. ఇల్లు కూడా చాలా బాగుందన్నాడు. కాని మన బయట వాకిలి ఏమీ బాగాలేదన్నాడు.ఆయన వడ్రంగట. వాకిలి కొంచెం కూడా బాగాలేదు. ఆమాట మీతో తప్పకుండా చెప్పమన్నాడు," అన్నది భార్య.

సంగయ్య ఆశ్చర్యపడుతూ తన ఇంటి ముఖద్వారాన్ని చాలాసేపు జాగ్రత్తగా పరిశీలించాడు.కానిఅందులో అతనికిలోపమేమీ కనపించలేదు.

ఒక ఏడాది తిరిగి మళ్ళీ వేసవి వచ్చింది. శరభయ్య ఇంకొకసారి ఆ ప్రాంతాలకు రావడంజరిగింది. ఈసారయినా సంగయ్యను చూసి పోదామనే ఉద్దేశ్యంతో అతను వారింటికి వెళ్ళి, బయటనుంచి, "సంగయ్యా!" అని పిలిచాడు.

సంగయ్య భార్య తలుపు తెరుచుకుని పంచలోకివచ్చి,శరభయ్యను చూసి,"రండి, రండి! లోపలికి రండి!" అన్నది ఎంతో





సంతోషంగా. "సంగయ్య ఇంట్లో ఉన్నాడా, అమ్మా? అతడినిచూద్దామనివచ్చాను," అని శరభయ్య వాకిటి ముందే నిలబడి అడిగాడు.

"లేరు, బయటికి వెళ్ళారు. త్వరగానే వస్తారు. మీరు లోపలికి రండి!" అన్నదామె ఆప్యాయంగా. ఎండ మండిపోతున్నది. అయినా శరభయ్య తల అడ్డంగా తిప్పి, "ఎందుకులే? ఈ చెట్టుకింద బాగానే ఉంది," అంటూ చెట్టుకింది అరుగుకేసి వెళ్ళసాగాడు.

"మాకు ఇల్లూ వాకిలీ లేనట్టు మీరు చెట్టుకింద కూర్చోవడ మేమిటి? లోపలికి రండి," అన్నదామె. "సరే, నీ ఇష్టం!" అంటూ శరభయ్య ఆమెవెంట లోపలికి వెళ్ళాడు.

ఇంట్లోపల చల్లగా, సుఖంగా ఉంది. సంగయ్యభార్య అతనికి మంచంవాల్చింది.

"ఈసారయినా సంగయ్య తప్పకుండా కనిపిస్తాడనుకున్నాను. నాకు అతన్ని చూసే గీత ఉన్నట్టు కనబడడం లేదు," అన్నాడు శరభయ్య.

సంగయ్య భార్య అవతలికి వెళ్ళి కొంచెం సేపట్లో ఒక పళ్ళెంలో మూడులోటాలు పెట్టి తెచ్చి అతని ముందు పెట్టింది. వాటిలో చిక్కని మజ్జిగా, కొబ్బరినీళ్ళూ, చల్లనికుండ నీరూ ఉన్నాయి. "ఇవితీసుకోండి. భోజనం వేళకుఆయన వస్తారు. అంతదాకా విశ్రాంతి తీసుకోండి!" అన్నది సంగయ్య భార్య. "సంగయ్య భార్య ఎంతగామారిపోయింది!" అనుకున్నాడు శరభయ్య.

కొంతసేపటికి ఆమె వంట ఇంట్లోంచి తిరిగి వచ్చి, "వేళ దాటిపోతున్నది. మీరు భోజనానికి లేవండి," అన్నది.

"అప్పుడే ఏం తొందరమ్మా.సంగయ్యను కూడా రానీ!" అన్నాడు శరభయ్య.

"ఆయన ఆకలి ఆయనకే తెలీదు. ఆయన ఏవేళకు ఇంటికి చేరతారో!ఆయన కోసం మీరు కూడా తిండీతిప్పలు లేకుండా ఉండడం దేనికి? భోజనానికి లేవండి!" అన్నది సంగయ్య భార్య. శరభయ్య నిజంగానే చాలా ఆకలిమీద ఉన్నాడు. భోజనం

చాలా బాగుంది. భోజనం అయ్యాక శరభయ్య పడుకుని సూర్యాస్తమయ వేళకే లేచాడు. అప్పటికీ సంగయ్య ఇల్లు చేరనేలేదు.

"ఇక నేను వెళ్ళాలి. సంగయ్యను చూడ డంపడనేలేదు," అన్నాడు శరభయ్య

"వెళ్ళిపోకండి. ఈసారి కూడా మీరు కన బడకుండా వెళ్ళిపోతే ఆయన చాలా నొచ్చు కుంటారు. ఈ పూటకు ఉండండి, రేపు పోవచ్చు," అన్నది సంగయ్య భార్య.

"లేదమ్మా, వెళ్ళాలి. నాతో ప్రయాణం చేస్తున్నవారింకాఉన్నారు.వారుకనిపెట్టుకుని ఉంటారు. నాకూ ఉందామనే ఉంది గాని సాధ్యం కాదు. నేను సంగయ్యను మరీమరీ అడిగానని చెప్పు. మీ ఇల్లూ, తోటా చూసి నాకు చాలా ఆనందమయిందని చెప్పు. ముఖ్యంగా మీవాకిలిచూసి ఎంతో ముచ్చట పడ్డానని చెప్పు. నాకు వాకిళ్ళ సంగతి బాగా తెలుసు. నేను వడ్రంగిని. ఇది చాలా మంచి వాకిలి, భేషైన వాకిలి!" అంటూ శరభయ్య శలవుతీసుకునిఅక్కడినుంచివెళ్ళిపోయాడు.

ఆ రాత్రి సంగయ్య బాగా పొద్దుపోయి ఇంటికి వచ్చాడు. అతని భార్య శరభయ్య వచ్చివెళ్ళిన సంగతి చెప్పి, అతను అన్న మాటలు కూడా చెప్పింది. అంతా విని సంగయ్య, "శరభయ్య చాలా యోగ్యుడు, మంచి స్నేహితుడు, చాలా తెలివైనవాడు కూడా!" అన్నాడు.

"ఆయన కిందటేడు వచ్చినప్పుడు, మన తలవాకిలి ఎంతమాత్రమూ బాగా లేద న్నాడు. ఈ యేడు దాన్నే చాలా మెచ్చుకున్నాడు.!" అన్నది భార్య.

"కిందటేడు అతను మన వాకిలి బాగా లేదన్నప్పుడు నాకేమీ అర్థం కాలేదు. కానీ ఈ యేడు వాకిలిని మెచ్చుకునేసరికి నా కంతా అర్థమైపోయింది. అతనలా ఎందు కన్నాడో తెలిసిందా?కిందటేడు అతనువచ్చి నప్పుడు నువ్వు అతనికి సరిగ్గా ఆతిథ్యం ఇచ్చి ఉండవు. అందుచేతనే మన ఇంటి ముఖద్వారంఅతనికిఏమాత్రమూనచ్చలేదు. ఈసారి సరిగ్గా ఆతిథ్యం ఇచ్చావు కాబోలు, అందువల్లనే అతనికి వాకిలి ఎంతో నచ్చింది!" అన్నాడు సంగయ్య.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.


S.G. SESHAGIRI


S.G. SESHAGIRI

✱ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✱ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✱ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✱ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ముద్దులొలికే పాపకు అంతా రమ్యం!

రెండవ ఫోటో : పొద్దువాలక ముందే చేరాలి గమ్యం!

పంపినవారు : బొబ్బిలి శ్రీనివాసరావు, గోదావరి హెడ్ వర్క్స్ డివిజన్

ధవళేశ్వరం - 533125 (తూ॥గో॥జిల్లా).




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

